

# శ్రీ సత్యనారాయణ వ్రతకల్పః

## ఆంధ్రానువాదము





అనువాదకులు:

వానమామలై వరదాచార్యులు.

ప్లవంగ సం॥ర
ఉగాది
1967







వెల అమూల్యము.



ముద్రణ :
శ్రీ రామా పవర్ ప్రెస్,
సికింద్రాబాదు.

శ్రీ

# శ్రీ సత్యనారాయణవ్రత పూజావిధానము.

కేశవాయస్వాహా, నారాయణాయస్వాహా,
మాధవాయస్వాహా, గోవిందాయ నమః,
విష్ణవే నమః, మధుసూదనాయ నమః.
త్రివిక్రమాయ నమః, వామనాయ నమః,
శ్రీధరాయ నమః, హృషీకేశాయ నమః,
పద్మనాభయ నమః, దామోదరాయ నమః,
సంకర్షణాయ నమః, వాసుదేవాయ నమః,
ప్రద్యుమ్నాయ నమః, అనిరుద్ధాయ నమః,
పురుషోత్తమాయ నమః, అధోక్షజాయ నమః,
నారసింహాయ నమః, అచ్యుతాయ నమః,
జనార్దనాయ నమః, ఉపేంద్రాయ నమః,
హరయే నమః, శ్రీకృష్ణాయ నమః,

శ్లో॥ యశ్శివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళా,
తయో స్సంస్మరణాత్పుంసాం సర్వతో జయ మంగళమ్.
లాభస్తేషాం జయస్తేషాం కుతస్తేషాం పరాభవః,
యేషామిందీవర శ్యామో హృదయస్థో జనార్దనః,

ఆపదామప హర్తారం దాతారం సర్వ సంపదాం,
లోకాభి రామం, శ్రీరామం భూయోభూయో నమా
సర్వమంగళ మాంగళ్యే శివే సర్వార్థసాధకే [మ్యహం,
శరణ్యే త్ర్యంబకే దేవీ నారాయణి నమోఽస్తు తే.

శ్రీ లక్ష్మి నారాయణాభ్యాం నమః, ఉమా మహేశ్వ రాభ్యాం నమః వాణీ హిరణ్య గర్భాభ్యాం నమః, శచీ పురంద రాభ్యాం నమః, అరుంధతీ వశిష్ఠాభ్యాం నమః, శ్రీ సీతారామా భ్యాం నమః, సర్వేభ్యో మహాజనేభ్యో నమః, అయం ముహూర్త స్సుముహూర్తోఽస్తు.

ఉత్తిష్ఠంతు, భూత పిశాచాః, ఏతే భూమి భారకాః, ఏతేషామ విరోధేన బ్రహ్మ కర్మ సమారభే, ఓం భూః! ఓం భువః. ఓగ్ం సువః, ఓం మహః, ఓం జనః, ఓం తపః, ఓగ్ం సత్యం, ఓం తత్సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీ మహి ధియో యోనః ప్రచోదయాత్.

ఓమాపోజ్యోతీరసోఽమృతం బ్రహ్మ భూర్భువస్సు వరోం. మమోపాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం శుభే శోభనే ముహూర్తే శ్రీమహా విష్ణో రాజ్ఞయా ప్రవర్తమానస్య ఆద్యబ్రహ్మణః ద్వితీయ పరార్థే శ్వేతవరాహ కల్పే వైవస్వత మన్వంతరే కలియుగే ప్రథమపాదే జంబూ ద్వీపే భారతవర్షే భరతఖండే అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానేన.........సంవత్సరే..........అయనే......
...మాసే.........పక్షే ..........తిథౌ..........వాసరే
శుభనక్షత్రే శుభయోగే శుభకరణే ఏవంగుణ విశేషణ విశిష్టా

యాం శుభతిథౌ శ్రీమాన్.........గోత్రః.........నామ ధేయః ధర్మపత్నీ సమేతోఽహం శ్రీమతః.........గోత్రస్య .........నామధేయస్య ధర్మపత్నీ సమేతస్య మమ సకుటుంబస్య క్షేమ స్థైర్య విజయఅభయాయురారోగ్యైశ్వర్యాభి వృద్ధ్యర్థం ధర్మార్థకామ మోక్ష చతుర్విధ పురుష ఫలావాప్త్యర్థం చింతిత మనోరథ సిద్ధ్యర్థం శ్రీ సత్యనారాయణ ముద్దిశ్య శ్రీ సత్యనారాయణ ప్రీత్యర్థం పురుషసూక్తవిధానేన ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజాం కరిష్యే.

ఆదౌ నిర్విఘ్న పరిసమాప్త్యర్థం గణాధిపతి పూజాం కరిష్యే. తదంగ కలశారాధనం కరిష్యే.

శ్లో॥ కలశస్య ముఖే విష్ణుః కంఠేరుద్ర స్సమాశ్రితః
మూలేతత్ర స్థితో బ్రహ్మ మధ్యే మాతృ గణాశ్శ్రితాః
కుక్షౌతు సాగరాస్సర్వే సప్తద్వీపా వసుంధరా,
ఋగ్వేదోఽథ యజుర్వేద స్సామవేదోహ్యధర్వణః.
అంగైశ్చ సహితా స్సర్వే కలశంతు సమాశ్రితాః,
కలశే గంధపుష్పాక్షతాన్ నిక్షిప్య, హస్తేనాచ్ఛాద్య,
ఆపోవా ఇదగ్ం సర్వం విశ్వా భూతాన్యాపః
ప్రాణా వా ఆపః పశవః
ఆపోఽన్న మాపోఽమృత మాప స్సమ్రాడాపో
విరాడాప స్స్వరాడాప శ్ఛందాగ్ం స్యాపో
జ్యోతీగ్ం ష్యాపో యజూగ్ం ష్యాప స్సత్యమాప
స్సర్వా దేవతా ఆపో భూర్భువస్సువరాప ఓం.

శ్లో॥ గంగేచ యమునే చైవ గోదావరి సరస్వతి,
నర్మదే సింధుకావేరి జలేఽస్మిన్ సన్నిధిం కురు.

ఆయాంతు శ్రీ సత్యనారాయణ పూజార్థం దురితక్షయ కారకాః, కలశోదకేన దేవ మాత్మానం పూజాద్రివ్యాణిచ సంప్రోక్ష్య.

## అథ గణపతి పూజా.

మంత్రం :- గణానాం త్వా గణపతిగ్ం హవామహే కవిం కవీనా ముపమశ్రవ స్తవం, జ్యేష్ఠరాజం బ్రహ్మణాం బ్రహ్మణస్పత ఆన శ్శృణ్వన్నూతి భి స్సీద సాదనం.

శ్రీ మహాగణాధిపతయేనమః ధ్యాయామి, ఆవాహయామి, రత్నసింహాసనం సమర్పయామి.

పాదయోః పాద్యం సమర్పయామి, హస్తయోరర్ఘ్యం సమర్పయామి, ముఖే ఆచమనీయం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః స్నపయామి స్నానానంతరం శుద్ధాచమనీయం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః వస్త్రయుగ్మం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః యజ్ఞోపవీతం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః దివ్యశ్రీ చందనం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః దూర్వాదినానావిధ పుష్పాణి పూజయామి.

ఓం సుముఖాయ నమః, ఓం ఏకదంతాయ నమః,
ఓం కపిలాయ నమః, ఓం గజకర్ణికాయ నమః
ఓం లంబోదరాయ నమః, ఓం వికటాయ నమః
ఓం విఘ్నరాజాయ నమః ఓం గణాధిపాయ నమః
ఓం ధూమకేతవే నమః, ఓం గణాధ్యక్షాయ నమః,
ఓం ఫాలచంద్రాయనమః, ఓం గజాననాయనమః,
ఓం వక్రతుండాయ నమః, ఓం శూర్పకర్ణాయ నమః
ఓం హేరంబాయ నమః, ఓం స్కందపూర్వజాయనమః,
ఓం సర్వసిద్ధి ప్రదాయకాయ నమః,

శ్రీ మహాగణాధిపతయేనమః నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః ధూపమాఘ్రాపయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః దీపం దర్శయామి, ధూప దీపానంతరం ఆచమనీయం సమర్పయామి.

నైవేద్యం :- ఓం భూర్భువ స్సువః. ఓం తత్ సవితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ సత్యం త్వర్తేన పరిషించామి.

(ఋతంత్వా సత్యేన పరిషించ్యామి అని రాత్రి చెప్ప వలెను).

శ్రీ మహాగణాధిపతయేనమః గుడోపహార నైవేద్యం సమర్పయామి. అమృతమస్తు అమృతోప స్తరణమసి.

ఓం ప్రాణాయ స్వాహా:—ఓం అపానాయ స్వాహా,
ఓం వ్యానాయ సాహా, ఓం ఉదానాయస్వాహా,

ఓం సమానాయస్వాహా, మధ్యే మధ్యే పానీయం సమర్పయామి. హస్తౌ ప్రక్షాళయామి. శుద్ధాచమనీయం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః తాంబూలం సమర్పయామి.

శ్రీ మహాగణాధిపతయేనమః సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి.

శ్లో॥ మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం గణాధిప
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే.

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచార పూజ యాచ భగవాన్ సర్వాత్మకః శ్రీ మహాగణాధిపతి స్సుప్రీతో వరదో భూత్వా ఉత్తరే కర్మణ్యా విఘ్నమస్త్వితి భవంతో బ్రువంతు ఉత్తరే కర్మణ్యా విఘ్నమస్తు.

గణాధిపతి ప్రసాదం శిరసా గృహ్ణామి.

శ్లో॥ సహస్రపరమాదేవీ శతమూలా శతాంకురా,
సర్వగ్ం హరతు మే పాపం దూర్వాదుస్స్వప్ననాశనీ.
గణపతిం యథాస్థాన ముద్వాసయామి.

యజ్ఞేన యజ్ఞమయ జంత దేవాస్తాని ధర్మాణి ప్రథమాన్యాసన్ తేహనాకం మహిమాన స్సచంతే యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః.

## అథ గౌరీ పూజా.

ఓం గౌరీ మిమాయ సలిలాని తక్షత్యేకపదీ ద్విపదీసా చతుష్పదీ । అష్టాపదీనవపదీ బభూవుషీ । సహస్రాక్షరా పరమే వ్యోమన్.

గౌరీం సాఙ్గాం సాయుధాం సవాహనామావాహయామి స్థాపయామి పూజయామి పాద్యాది సర్వోపచారైః సంపూజ్య.

శ్లో॥ సంసారభీతి విచ్ఛిత్త్రీ త్రాహిమాం సింహవాహని ।
పూజితాయేన కామేన దేహి తన్మే మహేశ్వరి ॥
మన్త్రహీనం క్రియాహీనం భక్తిహీనం శివప్రియే ।
యత్పూజితం మయాదేవి పరిపూర్ణం తదస్తుతే ॥
అనయా పూజయా సపరివారా గౌరీ ప్రీయతామ్.

# అథ నవగ్రహారాధనమ్.

## నవగ్రహారాధనాఖ్యం కర్మ కరిష్యే

## సూర్యగ్రహారాధనం



శ్లో॥ వేదీ మధ్యేలలిత కమలే కర్ణికాయాం రథస్థః
సప్తాశ్వోఽర్కోఽరుణరుచివపుస్సప్తరజ్జు ర్ద్విబాహుః
గోత్రే రమ్యే బహువిధగుణే కాశ్యపాఖ్యే ప్రసూతః
కాళిఙ్గాఖ్యే విషయ జనితః ప్రాఙ్ముఖః పద్మహస్తః॥
పద్మాసనః పద్మకరో ద్విబాహుః
పద్మద్యుతి స్సప్త తురంగ వాహః ।
దివాకరో లోక వపుః కిరీటి
మయి ప్రసాదం విదధాతు దేవః ॥

హరిః ఓం ॥ ఆకృష్ణేన రజసా వర్తమానో నివేశయన్నమృతం మర్త్యంచ । హిరణ్యయేన సవితారథే నాదేవోయాతి భువనాని పశ్యన్ ॥

సూర్యగ్రహం సాఙ్గం సాయుధం పత్నీపుత్ర పరివార సమేతం మధ్యేవర్తులాకార మండలే ఆవాహయామి.

స్థాపయామి పూజయామి.

సూర్యగ్రహస్య దక్షిణతః సూర్యగ్రహాధి దేవతాం అగ్నిమావాహయామి.

సూర్యగ్రిహా స్యోత్తరతః సూర్యగ్రహ ప్రత్యధిదేవతాం రుద్రమాఽవాహయామి.

స్థాపయామి పూజయామి.

శ్లో॥ ఆగ్నేయ భాగే సరథోదశాశ్వ
శ్చాత్రేయ జోయామున దేశ జశ్చ ।
ప్రిత్యఙ్ముఖస్థ శ్చతురశ్ర పీఠే
గదాధరాఙ్గో హిమవత్స్వభావః ॥
శ్వేతామ్బర శ్వేతవపుః కిరీటీ
శ్వేతద్యుతి ర్దణ్డధరోద్విబాహుః ।
చన్ద్రోఽమృతాత్మా వరదః కిరీటీ
శ్రేయాం సిమహ్యాం విదధాతు దేవః ॥

హరిః ఓం ఆప్యాయస్వసమేతుతే విశ్వతస్సోమ వృష్ణియమ్ । భవావాజస్య సంగథే ।

చంద్రగ్రహం సాఙ్గం సాయుధం పత్నీ పుత్ర పరివార సమేతం ఆగ్నేయ భాగే చతరశ్రిమణ్డలే ఆవాహయామి.

స్థాపయామి పూజయామి.

చంద్రగ్రిహస్య దక్షిణతః చంద్రగ్రిహాధి దేవతాః ఆపః ఆవాహయామి.

చంద్రగ్రహస్యోత్తరతః చంద్రగ్రిహ ప్రత్యధి దేవతాం గౌరీ మాఽవాహయామి.

స్థాపయామి పూజయామి.

శ్లో॥ యామ్యేగదా శక్తి ధరశ్చ శూలీ
వరప్రదో యామ్య ముఖోఽతిరక్తః ।
కుజస్త్వవన్తీ విషయస్త్రికోణ
స్తస్మిన్భరద్వాజకులే ప్రసూతః ॥
రక్తామ్బరో రక్తవపుః కిరీటీ
చతుర్భుజో మేషగమో గదాభృత్ ।
ధరా సుతశ్శక్తి ధరశ్చ శూలీ
సదామమాస్యా ద్వరదః ప్రశాన్తః ॥

హరిః ఓమ్ ॥ అగ్నిర్మూర్ధాదివః కకుత్పతిః పృథివ్యా అయం । అపాగ్ం రేతాగ్ం సిజిన్వతి ॥

అంగారక గ్రహం సాఙ్గం సాయుధం పత్నీ పుత్ర పరివార సమేతం దక్షిణ భాగే త్రికోణ మణ్డలే ఆవాహయామి.

స్థాపయామి పూజయామి.

అంగారక గ్రహస్య దక్షిణతః అంగారక గ్రహాధి దేవతాం పృథివీ మావాహయామి.

అంగారక గ్రహస్యోత్తరతః అంగారక గ్రహ ప్రత్యధి దేవతాం క్షేత్ర పాలక మావాహయామి.

స్థాపయామి పూజయామి.

శ్లో॥ ఉదఙ్ముఖో మాగధ జోహరిస్థ
శ్చాత్రేయ గోత్రశ్శర మణ్డలస్థః ।
సఖడ్గ చర్మోరు గదాధరోఙ్గ
స్త్వీశానభాగే వరదస్సుపీతః ॥

పీతామ్బరః పీతవపుః కిరీటీ
చతుర్భుజో దణ్డధరశ్చ సౌమ్యః ।
చర్మాసి ధృత్సోమ సుతస్సుమేరు
స్సింహాధి రూఢో వరదో బుధశ్చ ।

హరిః ఓమ్ ॥ ఉద్బుధ్య స్వాగ్నే ప్రతిజా గృహ్యేన మిష్టాపూర్తేనగ్ం సృజేథామయఞ్చ । పునః కృణ్వగ్గ్ స్త్వా పితరం యువాన మన్వాతాగ్ం సీత్వ యితున్తు మేతమ్.

బుధగ్రహం సాఙ్గం సాయుధం పత్నీ పుత్ర పరివార సమేతం ఈశాన భాగే బాణాకార మణ్డలే ఆవాహయామి.

స్థాపయామి పూజయామి.

బుధ గ్రహస్య దక్షిణతః బుధగ్రహాధి దేవతాం విష్ణు మావాహయామి.

బుధగ్రహస్యోత్తరతః బుధగ్రహ ప్రత్యధి దేవతాం నారాయణ మావాహయామి.

స్థాపయామి పూజయామి.

శ్లో॥ సౌమ్యే సుదీక్షే చతురశ్ర పీఠే
రథేఽఙ్గిరాః పూర్వ ముఖ స్వభావః ।
దణ్డాక్షమాలా జలపాత్ర ధారీ
సిన్ధ్వాఖ్యదేశే వరదస్సురేశః ॥
స్వర్ణామ్బరః స్వర్ణవపుః కిరీటీ
చతుర్భుజో దేవగురుః ప్రశాన్తః ।
తథాసి దణ్డంచ కమణ్డలుంచ
తథాక్ష సూత్రం వరదోఽస్తు మహ్యమ్ ॥

హరిః ఓమ్ ॥ బృహస్పతే అతియదర్యో అర్హాద్యుమ ద్విభాతి క్రతు మజ్జనేషు । యద్దీదయచ్ఛవస ర్త ప్రజాత తదస్మాస్సుద్రవిణం ధేహి చిత్రమ్ ॥

బృహస్పతి గ్రహం సాఙ్గం సాయుధం పత్నీ పుత్ర పరివార సమేతం ఉత్తర దిగ్భాగే దీర్ఘ చతురశ్ర మండలే ఆవాహయామి. స్థాపయామి పూజయామి.

బృహస్పతి గ్రహస్య దక్షిణతః బృహస్పతి గ్రహాధి దేవతాం బ్రహ్మాణ మావాహయామి.

బృహస్పతి గ్రహస్య ఉత్తరతః బృహస్పతి గ్రహ ప్రత్యధిదేవతాం ఇంద్ర మావాహయామి.

స్థాపయామి పూజయామి.

శ్లో॥ ప్రాచ్యాం భృగుర్భోజ కటిప్రదేశః
స్సభార్గవః పూర్వ ముఖ స్వభావః ।
సపంచకోణేశ రథాధి రూఢో
దండాక్షమాలా వరదోఽంబు పాత్రః ॥
శ్వేతాంబరః శ్వేతవపుః కిరీటీ
చతుర్భుజో దైత్య గురుః ప్రశాంతః ।
తథాసి దండంచ కమణ్డలుంచ
తథాక్ష సూత్రం వరదోఽస్తుమహ్యాం ॥

ఓమ్ ॥ శుక్రంతే అన్యద్యజతంతే అన్యద్విషురూపే అహనీ ద్యౌరివాసి, విశ్వాహి మాయా అవసి స్వధావో భద్రాతే పూషన్నిహరాతి రస్తు.

శుక్రగ్రహం సాంగం సాయుధం పత్నీ పుత్ర పరివార సమేతం ప్రాగ్భాగే పంచకోణ మండలే ఆవాహయామి.

స్థాపయామి పూజయామి.

శుక్రగ్రహస్య దక్షిణతః శుక్రగ్రహాధి దేవతామింద్రాణీ మావాహయామి.

శుక్రగ్రహస్య ఉత్తరతః శుక్రగ్రహ ప్రత్యధి దేవతాం ఇంద్రమరుత్వం త మావాహయామి.

స్థాపయామి పూజయామి.

శ్లో॥ చాపాసనోగృధ్రి రథస్సు నీలః
ప్రత్యఙ్ముఖః కాశ్యపజః ప్రతీచ్యాం ।
సశూలచాపేషు వరప్రదశ్చ
సౌరాష్ట్రదేశే ప్రభవశ్చ సౌరీ ॥
నీలద్యుతిర్నీల వపుః కిరీటీ
గృధ్రస్థిత శ్చాపకరో ధనుష్మాన్ ।
చతుర్భుజ స్సూర్య సుతః ప్రశాంత
స్సచాస్తుమహ్యాం వర మందగామీ ॥

ఓం ॥ శమగ్ని రగ్నిభి స్కరచ్ఛన్న స్తపతు సూర్యః । శంవాతోవా త్వరపా అపిస్రిధః

శనిగ్రహం సాంగం సాయుధం పత్నీ పుత్ర పరివార సమేతం పశ్చిమ దిగ్భాగే ధనురాకార మండలే ఆవాహయామి. స్థాపయామి పూజయామి.

శనిగ్రహస్య దక్షిణతః శనిగ్రహాధి దేవతాం యమ మావాహయామి.

శనిగ్రహస్య ఉత్తరతః శనిగ్రహస్య ప్రత్యధిదేవతాం ప్రజాపతి మావాహయామి. స్థాపయామి పూజయామి.

శ్లో॥ సైంహికేయో బర్బర దేశ జాతః
శూర్పాసనస్సింహ గత స్వభావః ।
యామ్యాననో నైఋత దిక్కరాళో
వరప్రదశ్శూల సచర్మ ఖడ్గః ॥
నీలాంబరో నీల వపుః కిరీటీ
కరాళవక్త్రః కరవాల శూలీ ।
చతుర్భుజశ్చర్మ ధరశ్చ రాహు
స్సింహాధిరూఢో వరదోఽస్తు మహ్యాం ॥

ఓం ॥ కయా నశ్చిత్ర ఆభువ దూతీ సదా వృధ స్సఖా, కయా శచిష్ఠ యావృతా.

రాహుగ్రహం సాంగం సాయుధం పత్నీ పుత్ర పరివార సమేతం నైఋతి దిగ్భాగే శూర్పాకార మండలే ఆవాహయామి. స్థాపయామి పూజయామి.

ఓం ఆయంగౌః పృశ్నిః క్రమీదసదన్మాతరః స్సువః, పితరం చప్రియం త్సువః.

రాహుగ్రహస్య దక్షిణతః రాహుగ్రహాధి దేవతాం గాం ఆవాహయామి.

రాహు గ్రహస్య ఉత్తరతః రాహుగ్రహ ప్రత్యధి దేవతాం సర్పమావాహయామి. స్థాపయామి పూజయామి.

శ్లో॥ ధ్వజాసనో జైమిని గోత్ర జోంత
ర్వేదేషు దేశేషు విచిత్ర వర్ణః ।
యామ్యాననో వాయుదిశః ప్రఖడ్గ
శ్చర్మాసి భిశ్చాష్ట సుతశ్చ కేతుః ॥
ధూమ్రో ద్విబాహు ర్వరదో గదా భృ
ద్గృధ్రాసనస్థో వికృతాననశ్చ ।
కిరీట కేయూర విభూషి తాంగః
సచాస్తుమే కేతుగణః ప్రశాంతః ॥

ఓం ॥ కేతుంకృణ్వన్న కేతవే పేశో మర్యా అపేశసే సముషద్భిరజాయథాః

కేతు గ్రహం సాంగం సాయుధం సపత్నీ పుత్ర పరివార సమేతం, వాయవ్య దిగ్భాగే ధ్వజాకార మండలే ఆవాహయామి. స్థాపయామి పూజయామి.

కేతు గ్రహస్య దక్షిణతః కేతుగ్రహాధి దేవతాం చిత్రగుప్త మావాహయామి.

కేతు గణస్య ఉత్తరతః కేతు గణస్య ప్రత్యధి దేవతాం బ్రహ్మాణ మావాహయామి. స్థాపయామి పూజయామి.

ఇంద్రం లోకపాలక మావాహయామి.

అగ్నిం లోకపాలక మావాహయామి.

యమం లోకపాలక మావాహయామి.

నిర్ ఋతిం లోకపాలక మావాహయామి.
వరుణం లోకపాలకమా వాహయామి.
వాయుం లోకపాలక మావాహయామి.
కుబేరం లోకపాలక మావాహయామి.
ఈశానం లోకపాలక మావాహయామి.
ఊర్ధ్వ పురష మావాహయామి.
పృథ్వీ మావాహయామి.
వాస్తు పురుష మావాహయామి,
సూర్యాది నవగ్రిహ దేవతాభ్యో నమః ।
ఇంద్రాద్యష్ట దిక్పాలక దేవతాభ్యో నమః ॥

మంటప దేవతాభ్యో నమః । సింహాసనం । పాద్యం । అర్ఘ్యం ఆచమనీయం । పంచామృత స్నానం । ఉద్వర్తనం । శుద్ధోదక స్నానం । వస్త్రం ! ఆచమనీయం । యజ్ఞోపవీతం । పునరాచమనీయం । చందనం । అక్షతాన్ । పుష్పాణి । హరిద్రాది పరిమళ ద్రవ్యాణి । ధూపం । దీపం । నైవేద్యం । పూర్వాపోశనం । మధ్యే మధ్యే పానీయం । ఉత్తరాపోశనం । హస్త ప్రక్షాళనం । పాద ప్రక్షాళనం । తాంబూలం । దక్షిణాం । ఆరార్తికం । మన్త్రి పుష్పాణి । ఆత్మ ప్రదక్షిణ నమస్కారాన్ ॥ సమర్పయామి ॥

అనయా పూజయా సూర్యాది నవగ్రహ దేవతాః ఇంద్రాద్యష్ట దిక్పాలక దేవతాః మంటప దేవతాః ప్రీయన్తామ్ ॥

# శ్రీ సత్యనారాయణ పూజా.

## ప్రాణ ప్రతిష్ఠాపనం - రిష్యై

ఓం అస్య శ్రీ ప్రాణప్రతిష్ఠాపన మహామంత్రస్య, బ్రహ్మ విష్ణు మహేశ్వరా ఋషయః. ఋగ్యజుస్సామాథర్వణాని ఛందాంసి, ప్రాణశ్శక్తిః పరాదేవతా హ్రాం బీజం, హ్రీం శక్తిః, క్రోం కీలకం. శ్రీ సత్యనారాయణ ప్రాణప్రతిష్ఠా జపే వినియోగః, హ్రాం అంగుష్ఠాభ్యాం నమః, హ్రీం తర్జనీభ్యాం నమః, హ్రూం మధ్యమాభ్యాం నమః, హ్రైం అనామికాభ్యాం నమః. హ్రౌం కనిష్ఠికాభ్యాం నమః; హ్రః కరతలకర పృష్ఠాభ్యాం నమః, హ్రాం హృదయాయ నమః, హ్రీం శిరసే స్వాహా, హ్రూం శిఖాయై వషట్, హ్రైం కవచాయ హుం, హ్రౌం నేత్రత్రయాయ వౌషట్, హ్రః అస్త్రాయ ఫట్, భూర్భువస్సువరోమితి దిగ్బంధః, ధ్యానం.

శ్లో॥ శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం ।
లక్ష్మీకాంతం కమలనయనం యోగి హృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవ భయహరం సర్వలోకైక నాథం॥

ఓం హ్రాం హ్రీం క్రోం యం రం లం వం శం షం హం ళం క్షం శ్రీ సత్యనారాయణ ప్రాణ ఇహ ప్రాణ ఓం హ్రాం హ్రీం క్రోం శ్రీ సత్యనారాయణ సర్వేంద్రియాణి వాఙ్మన శ్చక్షు శ్రోత్ర జిహ్వా ఘ్రాణ, ఇహైవాగత్య సుఖం చిరం

తిష్ఠంతు స్వాహా. ఓం అసు నీతే పునరస్మాసు చక్షుః పునః ప్రాణ మహినో దేహి భోగం జ్యోక్ప శ్యేమ సూర్య ముచ్చరంత మనుమ తే మృడయాన స్వ స్తి, అమృతంవై ప్రాణ అమృతమాపః ప్రాణానేవ యథాస్థాన ముపహ్వాయతే. సాంగం సాయుధం సవాహనం సశక్తిం పత్నీపుత్ర పరివార సమేతం శ్రీ సత్య నారాయణ మావాహయామి.

స్థాపయామి పూజయామి.

## ధ్యానం

శ్లో॥ ధ్యాయే త్సత్యం గుణాతీతం గుణత్రయ సమన్వితం,
లోకనాథం త్రిలోకేశం కౌస్తుభాభరణం హరిం।
పీతాంబరం నీలవర్ణం శ్రీవత్సపద భూషితం,
గోవిందం గోకులానందం బ్రహ్మాద్యైరభి పూజితం॥

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః. ధ్యానం సమర్ప యామి.

## ఆవాహనం

శ్లో॥ ఓం సహస్ర శీర్ షా పురుషః సహస్రాక్షః స్సహస్రపాత్,
సభూమిం విశ్వతో వృత్వా, అత్యతిష్ఠ ద్దశాంగులం.

శ్లో॥ జ్యోతి శ్శాంతం సర్వలోకాంతరస్థ
మోంకారాఖ్యం యోగి హృద్ధ్యాన గమ్యం,
సాంగం శక్తిం సాయుధం భక్తి సేవ్యం
సర్వాకారం విష్ణు మావాహయామి.

## ఆ స న ం

శ్లో॥ ఓం పురుష ఏవేదగ్ం సర్వం, యద్భూతం యచ్చభవ్యం
ఉతామృతత్వ స్యేశానః, యదన్నే నాతిరోహతి.

శ్లో॥ కల్పద్రుమూలే మణి వేది మధ్యే
సింహాసనం స్వర్ణమయం విచిత్రం,
విచిత్ర వస్త్రావృత మచ్యుత ప్రభో
గృహాణ లక్ష్మీ ధరణీ సమన్విత.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, రత్న సింహాసనం సమర్పయామి.

## పా ద్య ం

శ్లో॥ ఏతావానస్య మహిమా అతోజ్యాయాగ్‌శ్చ పూరుషః
పాదోస్య విశ్వాభూతాని, త్రిపాదస్యామృతం దివి.

శ్లో॥ నారాయణ నమస్తేస్తు నరకార్ణవతారక,
పాద్యం గృహాణ దేవేశ మమ సౌఖ్యం వివర్ధయ.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, పాదయోః పాద్యం సమర్పయామి.

## అ ర్ఘ్య ం

త్రిపాదూర్ధ్వ ఉదైత్పురుషః,
పాదో స్యేహా భవాత్పునః,
తతో విష్వఙ్వ్య క్రామత్

శ్లో॥ వ్యక్తా వ్యక్త స్వరూపాయ హృషీకపతయే నమః
మయా నివేదితో భక్త్యాహ్యర్ఘ్యోయం ప్రతిగృహ్యతాం.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, హస్తయో ర్ఘర్ఘ్యం సమర్పయామి.

## ఆ చ మ నీ య ం

తస్మాద్విరాడజాయత, విరాజో అధిపూరుషః,
సజాతోత్యరిచ్యత, పశ్చాద్భూమి మథో పురః
మందాకిన్యాస్తు యద్వారి సర్వపాపహరం శుభం,
తదిదం కల్పితం దేవ సమ్యగాచమ్యతాం విభో.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, ఆచమనీయం సమర్పయామి.

## స్నా న ం

యత్పురుషేన హవిషా, దేవా యజ్ఞ మతన్వత,
వసంతో అస్యాసీదాజ్యం, గ్రీష్మ ఇధ్మశ్శరద్ధవిః.

శ్లో॥ తీర్థోదకైః కాంచన కుంభ సంస్థై
స్సువాసితై ర్దేవ కృపారసార్ద్రైః,
మయార్పితం స్నానవిధిం గృహాణ
పాదాబ్జ నిష్ఠ్యూత నదీ ప్రవాహ.
శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, స్నపయామి.

# పంచామృత స్నానం

పిదప సత్యనారాయణ ప్రతిమను తములపుటాకున ఉంచి ఈ క్రింది విధముగా పంచామృతములతో శోధనము చేయవలెను.



**౧. ఆప్యాయస్వేతి క్షీరం.**

ఆప్యాయస్వ సమేతుతే విశ్వత స్సోమ వృష్ణియం, భవా వాజస్య సంగథే.



**౨. దధిక్రావ్ణ్ణ ఇతి దధి.**

దధిక్రావ్ణ్ణో అకారిషం, జిష్ణోరశ్వస్య వాజినః, సురభిణో ముఖాకరత్ప్రణ ఆయూగ్ంషి తారిషత్.

**౩. శుక్రమ సీత్యాజ్యం.**

శుక్రమసి జ్యోతిరసి తేజోసి దేవోవస్స వితోత్పునా త్వచ్ఛిద్రేణ పవిత్రేణ వసో స్సూర్యస్య రశ్మిభిః.

**౪. మధువాతా ఋతాయేతి మధు**

మధువాతా ఋతాయతే మధుక్షరంతి సింధవః, మాధ్వీర్నస్సంత్వోషధీః, మధునక్త ముతోషసి మధు మత్పార్థివగ్ం రజః, మధు ద్యౌరస్తునః పితా, మధుమాన్నో వనస్పతిర్మధుమాగ్ం అస్తు సూర్యః, మాధ్వీర్గావో భవంతునః.

**౫. స్వాదుః పవస్వేతి శుద్ధోదకం.**

స్వాదుః పవస్వ దివ్యాయ జన్మనే స్వాదురింద్రాయ సుహవేతు నామ్నే, స్వాదుర్మిత్రాయ వరుణాయ వాయవే బృహస్పతయే మధుమాగ్ం అదాభ్యః.

స్నానం పంచామృతై ర్దేవ గృహాణ పురుషో త్తమ.
అనాథనాథ సరజ్ఞ గీర్వాణ ప్రణతి ప్రియ.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, పంచామృత స్నానం సమర్పయామి.

## శుద్ధోదక స్నానం (ఆపోహిష్ఠేతి)

ఆపోహిష్ఠామయో భువ స్తాన ఊర్జే దథాతన, మహే రణాయచతుసే, యోవ శ్శివ తమోరస స్తస్య భాజయతే హనః, ఉశతీరివ మాతరః, తస్మా అరంగ మామవో యస్యక్షయాయ జిన్వథ, ఆపో జనయథాచనః.

శ్లో॥ నదీనాం చైవ సర్వాసామానీతం నిర్మలోదకం,
స్నానం స్వీకురు దేవేశ మయాద త్తం సురేశ్వర.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, శుద్ధోదకస్నానం సమర్పయామి.

## వస్త్రం

సప్తాస్యాస న్పరిధయః, త్రిస్స ప్త సమిధః కృతాః, దేవా యద్యజ్ఞం తన్వానాః, అబధ్నన్పురుషం పశుం.

శ్లో॥ వేదసూ క్త సమాయుక్తే యజ్ఞసామ సమన్వితే,
సర్వ వర్ణప్రదే దేవి వాససీతే వినిర్మితే.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, వస్త్రయుగ్మం సమర్పయామి.

## య జ్ఞో ప వీ త ం

తం యజ్ఞం బర్హిషి ప్రౌక్షన్, పురుషం జాతమగ్రతః,
తేన దేవా అయజంత, సాధ్యా ఋషయశ్చయే.

శ్లో॥ బ్రహ్మ విష్ణు మహేశానాం నిర్మితం బ్రహ్మ సూత్రకం,
గృహాణ భగవన్ విష్ణో సర్వేష్ట ఫలదో భవ.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, యజ్ఞోపవీతం సమర్పయామి.

## గ ం ధ ం

తస్మాద్యజ్ఞా త్సర్వ హుతః, సంభృతం పృషదాజ్యం,
పశూగ్ స్తాగుశ్చక్రే వాయవ్యాన్, అరణ్యాన్ గ్రామ్యాశ్చయే.

శ్లో॥ శ్రీఖండం చందనం దివ్యం గంధాఢ్యం సుమనోహరం,
విలేపనం సురశ్రేష్ఠ ప్రీత్యర్థం ప్రతిగృహ్యతాం.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, దివ్య శ్రీ చందనం సమర్పయామి.

## ఆ భ ర ణ ం

తస్మాద్యజ్ఞా త్సర్వ హుతః, ఋచస్సామాని జజ్ఞిరే,
ఛందాగ్ంసి జజ్ఞిరే తస్మాత్, యజుస్తస్మాద జాయత.

శ్లో॥ హిరణ్య హార కేయూర, గ్రైవేయ మణికంకణైః,
సుహారం భూషణైర్యుక్తం, గృహాణ పురుషోత్తమ.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, ఆభరణం సమర్పయామి.

## పుష్పం

తస్మా దశ్వా అజాయంత, యేకే చో భయా దతః,
గావోహ జజ్ఞిరే తస్మాత్, తస్మా జ్జాతా అజావయః.

శ్లో॥ మల్లికాది సుగంధీని మాలత్యాదీని వై ప్రభో,
మయా హృతాని పూజార్థం పుష్పాణి ప్రతిగృహ్యతాం.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, పుష్పం సమర్పయామి.

---

## అథాంగ పూజా.

ఓం కేశవాయ నమః పాదౌ పూజయామి,
ఓం గోవిందాయ నమః గుల్ఫౌ పూజయామి,
ఓం ఇందిరాపతయే నమః జంఘే పూజయామి,
ఓం అనఘాయ నమః జానునీ పూజయామి,
ఓం జనార్దనాయ నమః ఊరూ పూజయామి,
ఓం విష్టరశ్రవసే నమః కటిం పూజయామి,
ఓం కుక్షిస్థాఖిల భువనాయ నమః ఉదరం పూజయామి,
ఓం లక్ష్మీవక్షస్స్థలాలయాయనమః వక్షస్థలంపూజయామి,
ఓం శంఖచక్రగదాశార్ఙ్గపాణయే నమః బాహూన్ పూజయామి,
ఓం కంబు కంఠాయనమః కంఠం పూజయామి,
ఓం పూర్ణేందు నిభవక్త్రాయ నమః వక్త్రం పూజయామి,
ఓం కుందకుట్మలదంతాయ నమః దంతాన్పూజయామి,
ఓం నాసాగ్రమౌక్తికాయ నమః నాసికాం పూజయామి,

ఓం సూర్య చంద్రాగ్ని ధారిణే నమః నేత్రే పూజయామి,
ఓం సహస్ర శిరసే నమః శిరః పూజయామి,
ఓం సత్యనారాయణ స్వామినే నమః సర్వాణ్యంగాని పూజయామి.

## ధూపం

యత్పురుషం వ్యదధుః, కతిథా వ్యకల్పయన్ ముఖం కిమస్య కౌ బాహూ, కావూరూపాదావుచ్యేతే.

శ్లో॥ దశాంగం గుగ్గులూపేతం సుగంధం సుమనోహరం,
ధూపం గృహాణ దేవేశ సర్వదేవ నమస్కృత.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః ధూపమాఘ్రాపయామి.

## దీపం

బ్రాహ్మణోస్య ముఖమాసీత్, బాహూ రాజన్యః కృతః ఊరూ తదస్య యద్వైశ్యః, పద్భ్యాగ్ం శూద్రో అజాయత.

శ్లో॥ ఘృతాక్త వర్తి సంయుక్తం వహ్నినా యోజితం ప్రియం,
దీపం గృహాణ దేవేశ - త్రైలోక్య తిమిరాపహం.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః దీపం దర్శయామి.

## నైవేద్యం

చంద్రమా మనసో జాతః చక్షో స్సూర్యో అజాయత, ముఖా దింద్ర శ్చాగ్నిశ్చ ప్రాణా ద్వాయు రజాయత.

శ్లో॥ సౌవర్ణస్థాలి మధ్యే మణిగణ ఖచితే గోఘృతాక్తాన్ సుపక్వాన్ భక్ష్యాన్ భోజ్యాంశ్చ లేహ్యానపరిమితరసాన్ చోష్యమన్నం నిధాయ, నానాశాకైరుపేతం దధి మధు సగుడ క్షీర పానీయ యుక్తం తాంబూలం చాపి విష్ణోః ప్రతిదివస మహం మానసే కల్పయామి. రాజాన్నం సూపసంయుక్తం శాక చోష్య సమన్వితం, ఘృత భక్ష్య సమాయుక్తం నైవేద్యం ప్రతి గృహ్యతాం. ఓం భూర్భువస్సువః, ఓం తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యోనః ప్రచోదయాత్ సత్యం త్వర్తేన పరిషించామి, అమృతమస్తు. అమృతో పస్తరణమసి.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః మహా నైవేద్యం సమర్పయామి.

ఓం ప్రాణాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా,
ఓం వ్యానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా,
ఓం సమానాయ స్వాహా.

అమృతాపిధాన మసి, ఉత్తరాపోశనం సమర్పయామి, హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి, శుద్ధాచమనీయం సమర్పయామి.

## తాంబూలం

నాభ్యా ఆసీదంతరిక్షం, శీర్ష్ణో ద్యౌస్సమ వర్తత, పద్భ్యాం భూమర్దిశశ్శ్రోత్రాత్, తథా లోకాగ్ం. అకల్పయన్.

శ్లో॥ పూగీఫలై స్సకర్పూరై ర్నాగవల్లీ దళైర్యుతం,
ముక్తాచూర్ణ సమాయుక్తం, తాంబూలం ప్రతిగృహ్యతాం.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః తాంబూలం సమర్పయామి.

## నీ రా జ న ం

వేదాహమేతం పురుషం మహాంతం
ఆదిత్య వర్ణం తమసస్తు పారే,
సర్వాణి రూపాణి విచిత్య ధీరః
నామాని కృత్వా భివదన్ యదాస్తే.
సర్వప్రజాం మే గోపాయ అమృతత్వాయ జీవసే,
జాతాం జనిష్యమాణాం చ అమృతే సత్యే ప్రతిష్ఠితాం॥

.......................................................................................

.......................................................................................

మానోహిగ్ం సీజ్జాత వేదో గామశ్వం పురుషం జగత్,
అబిభ్రదగ్న ఆగహి శ్రియామా మాపరిపాలయ,
సమ్రాజం చ విరాజం చాభి శ్రీర్యాచ నో గృహే,
లక్ష్మీరాష్ట్రస్యయా ముఖే తయామాసగ్ం సృజామసి॥

సంతత శ్రీరస్తు, సర్వమంగళానిభవంతు, నిత్య శ్రీరస్తు, నిత్య మంగళాని భవంతు.

శ్లో॥ నీరాజనం గృహాణేదం పంచవర్తి సమన్వితం,
తేజోరాశి మయం దత్తం, గృహాణత్వం సురేశ్వర.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః కర్పూర నీరాజనం సమర్పయామి.

# మంత్రపుష్పం

ధాతా పురస్తాద్యము దాజహార శక్రః
ప్రవిద్వాన్ ప్రదిశశ్చతస్రః
తమేవం విద్వానమృత ఇహ భవతి,
నాన్యః పంథా అయనాయ విద్యతే.
ఓం సహస్రశీర్షం దేవం విశ్వాక్షం విశ్వశంభువం,
విశ్వం నారాయణం దేవ మక్షరం పరమం పదం,
విశ్వతః పరమాన్నిత్యం విశ్వం నారాయణగ్ం హరిం,
విశ్వమే వేదం పురుష స్త ద్విశ్వముప జీవతి పతిం
విశ్వస్యాత్మేశ్వరగ్ం శాశ్వతగ్ం శివమచ్యుతం
నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణం,
నారాయణ పరోజ్యోతి రాత్మా నారాయణః పరః,
నారాయణ పరం బ్రహ్మ తత్వం నారాయణః పరః,
నారాయణ పరో ధ్యాతా ధ్యానం నారాయణః పరః,
యచ్చ కించిజ్జగత్సర్వం దృశ్యతే శూ్రయతే పివా,
అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః,
అనంత మవ్యయం కవిగ్ం సముద్రేంతం విశ్వ శంభువం,
పద్మకోశ ప్రతీకాశగ్ం హృదయం చాప్యధో ముఖం,
అధోనిష్ట్యా వితస్త్యాన్తే నాభ్యాముపరి తిష్ఠతి,
జ్వాలమాలాకులం భాతి విశ్వస్యాయతనం మహత్.
సంతతగ్ం శిలాభిస్తు లంబత్యా కోశ సన్నిభం,
తస్యాన్తే సుషిరగ్ం సూక్ష్మం తస్మిన్ త్సర్వం ప్రతిష్ఠితం,

తస్య మధ్యే మహా నగ్ని ర్విశ్వార్చి ర్విశ్వతో ముఖః,
సో గ్రభు గ్విభ జన్తిష్ఠ న్నాహార మజరః కవిః,
తిర్యగూర్ధ్వ మధశ్శాయీ రశ్మయ స్తస్య సంతతాః,
సంతాప యతి స్వం దేహ మాపాదతల మస్తకః,
తస్య మధ్యే వహ్నిశిఖా అణీయోర్ధ్వా వ్యవస్థితః,
నీలతోయద మధ్యస్థా ద్విద్యుల్లేఖేవ భాస్వరా,
నీవారశూక వత్తన్వీ పీతాభాస్వత్యణూపమా,
తస్యా శ్శిఖాయా మధ్యే పరమాత్మా వ్యవస్థితః,
సబ్రహ్మ సశివ స్సహరిస్సేంద్రసో్సతురః పరమస్స్వరాట్,
రాజాధిరాజాయ ప్రసహ్యాసాహినే,
నమో వయం వైశ్రవణాయ కుర్మహే,
సమే కామాన్కామకామాయ మహ్యాం
కామేశ్వరో వైశ్రవణోదదాతు కుబేరాయ
వైశ్రవణాయ మహారాజాయ నమః.
తద్విష్ణోః పరమం పదగ్ం సదా పశ్యంతి సూరయః,
దివీ విచక్షురాతతం, తద్విప్రాసో విపన్యవో జాగృ
వాంస స్సమింధతే విష్ణోర్య త్పరమం పదమ్.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః సువర్ణ మంత్ర పుష్పం సమర్పయామి.

## ప్రదక్షిణ నమస్కారాః

శ్లో॥ యాని కానిచ పాపాని జన్మాంతర కృతాని చ,
తాని తాని ప్రణశ్యంతి ప్రదక్షిణ పదే పదే,

పాపోహం పాపకర్మాహం పాపాత్మా పాప సంభవః,
త్రాహిమాం కృపయా దేవ శరణాగత వత్సల,
అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ,
తస్మాత్కారుణ్య భావేన రక్ష రక్ష జనార్దన,
ప్రదక్షిణం కరిష్యామి సర్వాభ్రమనివారణం.
సంసార సాగరాన్మాం త్వముద్ధరస్వ మహాప్రభో.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః. ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి.

ఛత్రం సమర్పయామి. చామరం సమర్పయామి,
గీతం శ్రావయామి, నృత్యం దర్శయామి,
నాట్యం సమర్పయామి. సమస్త రాజోపచారాన్
సమర్పయామి.

## ప్రార్థనా

శ్లో॥ అమోఘం పుండరీకాక్షం నృసింహం దైత్య సూదనం,
హృషీకేశం జగన్నాథం వాగీశం వరదాయకం,
సగుణంచ గుణాతీతం గోవిందం గరుడధ్వజం,
జనార్దనం జనానందం జానకీ వల్లభం హరిం.
ప్రణమామి సదా భక్త్యా నారాయణ మజం పరం,
దుర్గమే విషమే ఘోరే శత్రుణా పరి పీడితే.
విస్తారయతు సర్వేషు తథా నిష్టభయేషు చ,
నామాన్యేతాని సంకీర్త్య ఫల మీప్సిత మాప్నుయాత్.

సత్యనారాయణం దేవం వందేహం కామదం ప్రభుం.
లీలయా వితతం విశ్వం యేన తస్మై నమో నమః,

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, ప్రార్థనా నమస్కారాం త్సమర్పయామి.

## ఫ ల ం

శ్లో॥ ఇదం ఫలం మయాదేవ స్థాపితం పురత స్తవ,
తేనమే సఫలా వాప్తి ర్భవే జ్జన్మని జన్మని.

శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, ఫలం సమర్పయామి.

శ్లో॥ యస్య స్మృత్యా చ నామోక్త్యా తపః పూజాక్రియాదిషు,
న్యూనం సంపూర్ణతాం యాతి సద్యోవందేతమచ్యుతం,
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన,
యత్పూజితం మయాదేవ పరిపూర్ణం తదస్తుతే.

అనయా ధ్యాన ఆవాహనాది షోడశోపచారపూజయా చ భగవాంత్సర్వాత్మకః శ్రీ సత్యనారాయణ స్సుప్రీతో వరదో భవతు.

శ్రీ సత్యనారాయణ ప్రసాదం శిరసా గృహ్ణామి.



ఓం

శ్రీ సత్యదేవాయ నమః
శ్రీ వాగీశ్వర్యై నమః

# శ్రీ సత్యనారాయణ వ్రత కథ

## ప్రథమాధ్యాయము

తే. గీ. శ్రీమహిత నైమిశారణ్య సీమయందు
శౌనకాది ఋషీశ్వర సంఘ మొకట
సకల శాస్త్ర పురాణ బోధక వరేణ్యు
సూతు నానతు నడిగె నీ రీతి మున్ను. 1

తే. గీ. ఏ తపోవ్రతాదుల మనోభీష్టఫలము
కనఁ గలమొ దాని నంతయు వినవలతుము
తెలుపవే మునీశా! యని పలుక నతఁడు
వారి విను మని నుడువు నవ్యాజకృపను. 2

క. తానై నారదయోగి ప
రానుగ్రహ కాంక్షతోడ నఖిల జగత్ప్ర
స్థాన మొనరించు చొకపరి
మానవలోకమ్ముఁ గాంచ మహి విచ్చేసెన్. 3

క. అతఁ డిచ్చోటఁ గనుంగొనెఁ
బతితులను స్వకర్మవివశ బహువిధ దుఃఖా
న్వితులను నానాయోని
ప్రతితం జనియించి యేడ్చు భవబాధితులన్. 4

క. కని యా నారదముని తన
మనమున నిటు లెంచె నిట్టి మానవకోటిన్
మనుచుటకు దుఃఖనాశ
మ్మొనరింపఁగ సులభమార్గ మొకటియు లేదే. 5

క. అనుకొని వెస వైకుంఠ
మ్మునకుం జని యచట వెల్గు మోహానసితవ
ర్ణుని నారాయణుఁ గనుగొని
తన కరముల మోడ్చి స్తోత్ర తత్పరమతి యై. 6

క. శేషశయన! వనమాలా
భూషణ! ధృత శంఖ చక్ర ఫుల్లాబ్జ గదా
భూషిత చతుర్భుజా! భవ
శోషక మృదుపాద! నిత్య సూరి వినోదా! 7

క. జననమరణ రహితా! వా
ఙ్మనసాతీతా! స్వభక్త మానస బాధా
పనయన సంధాతా! ని
ర్గుణ గుణ సముపేత! యాది కూర్మోద్భూతా! 8

తే. గీ. ఆదిమధ్యాంతరహిత! యనాదిభూత!
నీలనీరదగాత్ర! విశాలనేత్ర!
దళితనతజనపాప! సత్యస్వరూప!
అందుకొను దేవదేవ! నా వందనములు. 9

క. ఆ నారదు స్తోత్రము విని
తా నారాయణుఁడు నిండు దయ నిట్లని.యెన్
మౌనీ! రాఁ గత మెయ్యది
మానస వాంఛితము దెలుపుమా యన నతఁడున్. 10

ఆ. వె. మర్త్యలోక మందు మనుజులు నిరతమ్ము
స్వీయ పాపకృతుల హేయ యోను
లందుఁ బుట్టి యెంతొ కుందుదు రది మాన్ప
సులభమార్గ మెదియొ చూపఁ గలవె? 11

క. చంచల చిత్తులు మత్తులు
కాంచన కాంతాది వస్తు కాంక్షారతులున్
పంచ మహాపాపములఁ జ
రించి వగన్ గుందుదురు స్మరింపరు నిన్నున్. 12

క. అంచిత జపతపములను జ
రించఁగ సహియించు దృఢశరీరులు గా రా
కొంచెపు శ్రమల ఫలము లభి
యించు వెరవు నాకు దయవహించి తెలుపవే! 13

క. అనుటయు నారాయణుఁ డి
ట్లను లోకారాధనమ్ము నర్థించుచుఁ జ
క్కని ప్రశ్నము నడిగితి వే
నును దదుపాయమ్ముఁ గూర్మి నుడివెద వినుమీ! 14

తే. గీ. స్వర్గమర్త్యాదు లందు నో సంయమీంద్ర !
దుర్లభం బైన యట్టి దీ దొడ్డ వ్రతము
దేని నాచరించుటఁ జేసి మానవుండు
మోహజాల వినిర్బంధ ముక్తుఁ డగునొ. 15

క. విను నీ యందలి స్నేహ
మ్మున సత్యవ్రత విధానమును దెల్పెద, దా
ని నొనర్చి యిహ సుఖాదిక
మును నాముష్మిక సుఖమ్ముఁ బొందుదురు మునీ! 16

క. నారదుఁడు విష్ణుమూర్తి ము
ఖేరిత వచనముల వినుచు నిట్లనె శ్రీమ
న్నారాయణ ! యీ వ్రత మే
తీరు నొనర్చుట ఫలంపు తె న్నెదియొ కదా ! 17

తే. గీ. విస్తరింపవె యనఁగ శ్రీవిష్ణు వనియెఁ
గరము సౌభాగ్య సంతతికరము దుఃఖ
శోకహరము జయప్రద సూచకమ్మ
నలఘు ధనధాన్య వర్ధక మగు వ్రత మిది. 18

క. అమిత దారిద్ర్య శమనార్థమైనఁ గాని
పోరు సేయఁగాఁ జనుటకుఁ బూర్వ మేని
తన కెదేని మహా విపద్దశ ఘటింప
నీ వ్రతము సేయఁ దగును వరేప్సువునకు. 19

తే. గీ. మాఘ మాధవ కార్తిక మాసములకు
వత్సరము కొక మా అథవా యొకొక్క
నెల కయినఁ గాని శుభ దినమ్ములను దీని
సలుపఁ దగు నారదా! యథా శక్తి కలన. 20

క. ఏకాదశినో పౌర్ణిమ
నోఁకనో రవి సంక్రమణపుఁ బుణ్య దినములం
దేకాగ్రి చిత్తమున సు
శ్లోకా! యీ వ్రతము సేయఁ జొప్పడు శుభముల్. 21

తే. గీ. వేకువనె లేచి దిన కృత్య విధము నెఱపి
మనుజుఁ డీ రీతి సంకల్ప మొనరుప వలె
దేవ దేవేశ! భగవన్! రమా వినోద!
త్వ త్ప్రియార్థము సత్యవ్రత మ్మొనర్తు. 22

క. అని యిట్టుల సంకల్పం
బొనరిచి మధ్యాహ్న కృత్యములఁ దీరిచి పా
వనుఁడై సాయం సమయ
మ్మున స్నాన మొనర్చి దేవుఁ బూజింప వలెన్. 23

క. వివిధా లంకరణమ్ముల
సవరించిన దేవు పూజ్య సద్మము దరిఁ జే
రి విలేపనార్థమై యటఁ
బవిత్రి గోమయమును తోడఁ బఱచవలె శుచిన్. 24

తే. గీ. ఆ విశుద్ధ ప్రదేశమ్మునలికి పిదపఁ
బంచవిధ రంగవల్లి రచించి దాని
పైన సదశ నూతన దృఢ వాసమ్ము
బఱచి దానిపైఁ దండుల ప్రకర ముంచి. 25

తే. గీ. వాని మధ్య స్వశక్తిలోపము సలుపక
వెండిదియొ రాగిదియొ తుదన్ విత్తహీనుఁ
డైన నిత్తడిదియొ మట్టిదైనఁ గాని
కలశ మిడ వలె సద్భక్తి కలితుఁ డగుచు. 26

తే. గీ. అట్టి కలశమ్ముపైఁ గ్రొత్త బట్ట నుంచి
దానిపై నిలుపవలె సత్య ప్రభువును
మూర్తి నిర్మాణ విధము నో మునివరేణ్య!
యెఱుఁగఁ జెప్పెద నటులె చేయించవలెను. 27

క. ఒక కర్ష మాత్రమో దా
నికి సగమున సగమొ స్వర్ణ నిర్మిత మూర్తిన్
బ్రకటించి తమి నమృత పం
చక మభిషేకించి నిల్పఁ జను పత్ర పీఠిన్. 28

క. ఆదిని విఘ్నేశుని నా
మీఁదటఁ బద్మజను విష్ణు మృత్యుంజయునిన్
శ్రీ దుర్గ నంగదేవ యు
తాదిత్యాది గ్రహాల నర్చించవలెన్. 29

క. అధిదేవ గణము మరి ప్రి
త్యధి దేవ గణాలు మన దిశాష్టకములయం
దధిపు లగు శక్రుఁ డాది వి
బుధులను సంపూర్ణ భక్తిఁ బూజింపవలెన్. 30

క. నారద! యేతద్వ్రతమును
ధారుణి నలుజాతులందుఁ దనరు పురుషులేన్
నారీ జనమ్ము లేనియుఁ
గోరికమై నాచరింపఁ గూడును వినుమీ! 31

క. పాఱులు సలుపన్ వలె నిది
పౌరాణిక వైదికోక్త పద్ధతి వెంటన్
వేఱే జాతులు దీనిని
పౌరాణిక విధుల సలుపవలె నెపు డేనిన్. 32

క. సతతము భక్తి శ్రద్ధా
యుతుఁడై సత్యవ్రతమ్ము నొనరింపవలెన్
మతి గల్గు నే దినమ్మో
నతి శుభద నిశాముఖమ్ము నందు నిజేచ్ఛన్. 33

క. వర రంభా ఫల ఘృత శ
ర్కరాది గోధూమ పిష్టరాశి సపాద
మ్ము రచించి నివేదనమున్
జరుపఁగ వలె బంధు మిత్ర సహితుం డగుచున్. 34

తే. గీ. ఒక్కవేళ గోధుమ పిండి చిక్కకున్న
శాలి చూర్ణమైనను సరె శర్కరయును
జిక్కకున్నన్ గుడమ్మొని జేర్చి సర్వ
భక్ష్యముల నైక్యపఱచి సపాదముగను
దేవ దేవునకై నివేదింపవలెను. 35

తే. గీ. కథను విని దక్షిణల విప్ర గణమున కిడి
పిదప బంధు మిత్రులఁ గూడి ప్రీతి మెయిని
సత్యదేవ ప్రసాద భక్షణ మొనర్చి
నృత్య గీత వినోదమ్ము నెఱపవలెను. 36

క. తదుపరి సత్య స్వామిని
మది నెంచుచు నరుగవలెను మందిరమున కె
య్యది తలఁప నద్ది సిద్ధిం
బొదవు లఘూపాయ మిదియె భూతల మందున్. 37

ఇది శ్రీ వానమామలై వరదాచార్య కృతం బగు
ఆంధ్ర సత్యవ్రత కల్పము నందు ప్రథమాధ్యాయము.

## ప్రథమాధ్యాయ కథ

ఒక సమయమునందు శౌనకాది మునులు సూతుని నిట్లడిగిరి. మహాత్మా! ఏ వ్రతముచేగాని ఏ తపస్సుచేగాని కోరిన కోరిక ఫలించునో దానిని దయతో నెఱింగింపుడు.

అంత వారిని గాంచి సూతుడిట్లనెను. మునులారా! తొల్లి నారదుడు నారాయణుని గాంచి దేవదేవా! పాపాలనాచరించి

భూజనులనేక కష్టములనుభవించుచు దుఃఖితులగుచున్నారు; ఏయుపాయముచే వీరీ యాపదలనుండి తప్పుకొని సుఖముల చూరగొందురని మీవలెనే యడిగెను. అంతనా శేషశాయి నారదునిగాంచి యిట్లుపల్కెను. నారదా! నీవు పరహితమును గోరి యీప్రశ్న నడిగితివి. దానికిగానొక సులభోపాయము గలదువినుము. వీరికి సత్యనారాయణవ్రత మొకటియేశరణ్యము. నీయందలి వాత్సల్యముచే దానివిధానమును దెలుపుచున్నాను. దీనినాచరించి మానవుడు భుక్తిముక్తులనొందగలడు. అది దుఃఖ శోకాదుల నశింపజేయగలదు, ఆపద వచ్చినపుడు దీనినేసమయ మందైనను ఏమాసమునందైనను, ఏతిథియందైనను నాచరింప వచ్చును. ప్రాతఃకాలమున లేచి కాల్యకృత్యముల దీర్చుకొని స్నానమాచరించి సాయంసమయమున పూజా గృహమునకు వచ్చి గోమయముతో స్థలశుద్ధిచేసి ఒక పీటనుంచి దానిపైన నంచులుగల ఒక తెల్లని వస్త్రమును పరచి బియ్య మును దానిపైనుంచి కలశమును స్థాపించి గణపతిని గౌరిని పూజించి నవగ్రహముల నధిదేవతా ప్రత్యధిదేవతలతోపాటు పూజించి సత్యనారాయణమూర్తిని షోడశోపచార పూజలతో నర్చించవలెను. గోధుమపిండి. ఆవునెయ్యి, చక్కెర, అరటిపండ్లు నారికేళ ఫలములు కలిపి సపాదముగునట్లు ప్రసాదమును సిద్ధ పరచి నివేదింపవలెను. పూజముగిసినపిదప వ్రత కథలను భక్తి శ్రద్ధలతో వినవలెను, బ్రాహ్మణులకు దక్షిణలిచ్చి బంధుజనులతో గూడి భుజించి అర్ధరాత్రి సమయమున నుద్వాసన మొనర్పవలయును. ఇట్లొనర్చిన మనుష్యుల కోరిన కోరికలు తప్పక ఫలించగలవు.

ఇది ప్రథమాధ్యాయము.

ఓం

శ్రీ సత్యదేవాయ నమః

శ్రీ వాగీశ్వర్యై నమః

# శ్రీ సత్యనారాయణ వ్రత కథ

## ద్వితీయాధ్యాయము

క. సూతుం డిట్లను మునులకు
నీ తెలుఁగున వ్రత మొనర్చి యిహపరసుఖ సం
ఘాతమ్ము నొంది మును వి
ఖ్యాతుండగు విప్రుఁ డొకఁడు కాశిన్ వెలసెన్. 1

క. ఆ భూసురుఁ డతినిర్ధనుఁ
డై భూమిం దిరుగు నెప్పుడాఁకలి దప్పిన్
దా భరియింపఁగ లేక వ్య
థాభరితస్వాంత మొప్ప దైన్యాత్ముండై. 2

క. వినుఁ డా దుఃఖితుఁ డగు బా
పని గని భగవానుఁడపుడ బ్రాహ్మణహితవ
ర్తనుఁ డయి ముది బాపని రూ
పును గొని చని యాదరమున భూసురు నిటనెన్. 3

క. ఇమ్మహి నూరక దీనతఁ
గ్రుమ్మరుచును నుంటివేల కుందుచు, నీ వృ
త్తమ్ము సమస్తము నుడువుమి
నెమ్మది వినవలతుఁ గుతలనిర్జర! వరుసన్. 4

క. అంతట బ్రాహ్మణుఁ డిట్లను
నెంతేనియు నిర్ధనుండ నేను ధరిత్రిన్
సంతతముఁ దిరుగుచుందు ర
వంత బికిరి మడిగికొన మహాశయ! వింటే. 5

ఆ. వె. దీనిఁ బాపు తెఱవు దేవర కెదియేని
దెలిసియున్న నద్ది పలుకు మనిన
వృద్ధ భూసురుండు విష్ణుండు స్వాశ్రిత
వరదుఁ డిట్లు కూర్మిఁ బలుకఁ దొడఁగె. 6

తే. గీ. సత్యనారాయణుండు వాంఛాఫలదుఁడు,
అతని వ్రతము మహోత్తమ మఖిల దుఃఖ
భంజకము, ధనధాన్య సంపత్ప్రదమ్ము
వాని వ్రత మీవు సేయఁగా వలయు విప్ర! 7

తే. గీ. దేని నాచరించుట వల్ల మానవుండు
నిఖిల దుఃఖ వినిర్ముక్తిని గనఁ గలఁడో
విప్రునకుఁ దద్వ్రతాచార విధముఁ జెప్పి
సత్ర విప్రుండు మఱుఁగయ్యె సత్యరూపి. 8

తే. గీ. అంత నా బ్రాహ్మణుఁడు నింటి కరిగి తాను
రేపె వ్రత మొనర్తు నని యా రేయి నిద్రఁ
గనక వగచి ప్రాతఃకాలముననె లేచి
వెడలె భిక్షార్థియై గ్రామవీథు లంటి. 9

తే. గీ. ఆ దివస మందె బ్రాహ్మణుం డమితధనము
పొంది బంధు జనమ్ముతోఁ బూర్ణభక్తి
సత్యనారాయణ వ్రతాచరణ సేసి
సర్వ దుఃఖ విముక్తుఁడై జగతి మనియె. 10

క. అప్పటి నుండియు విప్రుఁడు
తప్పక ప్రతిమాసమున వ్రతం బొనరుచుచున్
దప్పుకొనెఁ బాప సంగతి
నప్పరమపదమ్ము నేరి కబ్బనిది కొనెన్. 11

క. ఎపుడేతద్వ్రతమును నరుఁ
డపరిమిత ప్రేమఁ జేయు నపుడె యతని పా
విపదార్తు లడఁచు నా హరి
కృప సకలవిధాల నెందు క్షితితల మందున్. 12

క. ఈ రీతి నారదునికై
నారాయణు చేత వ్రతఘనత తెల్పఁ బడెన్
మీ రడుగ నే నుడివితిన్
వేఱే మీ కేమి యింక వెల్లడిపఱతున్? 13

క. అన మునిగణ మా సూతునిఁ
గని యని రత్యంతశ్రద్ధ గలిగెడి వినవో
యనఘా! యీ వ్రత మింకెవ
రొనరిచిరి విప్రుప్రవచనోద్ధతి ననుటల్. 14

క. వినుఁడీ మును లందఱు నె
వ్వనిచే నీ వ్రతము సేయఁ బడెనో పుడమిన్
మును నే నుడివిన విప్రుఁడు
తన విభవము కొలఁది బంధుతతి యుక్తుండై. 15

ఆ. వె. వ్రతము సేయఁ బూన వచ్చెనా సమయాన
వంటకట్టె లమ్ము వాఁ డొకండు
కడప బయటఁ దనదు కట్టెలమోపుంచి
విప్రగృహమునంటి వెడలిపోయె. 16

ఆ. వె. దప్పిచేతఁ బీడితస్వాంతుఁ డగుచును
బ్రాహ్మణుం డొనర్చు వ్రతముఁ గాంచి
ద్విజున కెఱఁగి పలికె దేవర! యీ పూజ
నేమి ఫలము గలుగు నెద్ది యనిన. 17

ఆ. వె. సత్యదేవువ్రతము సర్వేప్సితప్రద
మిద్ది, దీనిఁ జేయ నెవ్వఁడేని
ధరణి యందు సకల ధనధాన్యములఁ బొందు
విగత దుఃఖుఁడగుచు వెలయు ననిన. 18

ఆ. వె. బ్రాహ్మణుండు బల్కు పల్కు లెల్లను విని
హర్షమంది కట్టె లమ్ము వాఁడు
దివ్యభక్తితోడఁ దీర్థప్రసాదమ్ము
స్వీకరించి పల్లెఁ జేరఁబోయె. 19

క. చేరఁజని మానసమ్మున
నారాయణుఁ బొగడి భావనంబొనరిచె ని
ట్లేరోజు కట్టెలమ్మఁగఁ
గూరిన ధనమెల్ల నీదు కొఱకే స్వామి! 20

క. నీ పూజన మే చేసెద
నీపూట నటంచు మోపు నిడి తల నానాఁ
డే పట్టణవీథుల ధని
కోపేతస్థలికిఁ జని యొహో! కట్టెలనెన్. 21

క. ఆరో జదేమొ కట్టెల
పేరును విని నంత నాకె వేయు మనె నొకం
డౌరా! యదెట్లు వాఁడై
కోరిన డబ్బిత్తు ననియె కోమటి యొకఁడున్. 22

క. అన విని యా సెట్టిని గని
విన వయ్యా! నీకె యిచ్చివేయుదు సుమి! యీ
దినమున దొరికిన డబ్బున్
గాని సత్యవ్రతము సేయఁ గోరెద ననియెన్. 23

తే. గీ. ఔర! స్వార్థము కొఱకు వీఁ డడుగ లేదు
పూజ కొఱ కిడ నాకింత పుణ్యమె కదె
యనుచుఁ జెప్పిన వెలకు రెండంత లిచ్చె
దానిఁగని వాఁడు ముదితచేతస్కుఁ డయ్యె. 24

క. మోదము నొందుచుఁ బాలను
స్వాదువు గల యరఁటిపండ్లఁ జక్కెర నెయ్యిన్
గోధుమ పిండియు నేయి స
పాదమ్ముగఁ గూర్చి యింటి బాటన్ బట్టెన్. 25

క. బందుగులఁ బిలిచికొని యా
నందముగా వ్రత మొనర్చె నాఁడు మొదలు వాఁ
డొందె నెపు డిహసుఖమ్ముల
నందన ధన సంపదల ఘనంబగు ముక్తిన్. 26

ఇది శ్రీవానమామలై వరదాచార్యకృతం బగు
ఆంధ్ర సత్యవ్రతకల్పము నందు ద్వితీయాధ్యాయము.

## ద్వితీయాధ్యాయ కథ

మునులారా! రెండవ కథను చెప్పుచున్నాను. వినుడు! కాశీపురమునందొక బీద బ్రాహ్మణుఁ డుండెడివాఁడు. అతఁడు వ్యాకులచిత్తుఁడై భూమినంతటఁ దిరుగుచు బిచ్చమెత్తుకొను చుండెడివాఁడు. అతని దుఃఖమును గాంచలేక దయామయుఁడైన నారాయణుఁ డొకనాఁడు వృద్ధ బ్రాహ్మణ వేషముధరించి యతనినిగాంచి ఓ బ్రాహ్మణుఁడా! నీవేల దుఃఖించు చున్నావని యడిగెను. అంతనా బ్రాహ్మణుఁడు స్వామినిగాంచి మహాత్మా! నే నతి దరిద్రుఁడను, బిచ్చమెత్తుకొనుచు ఊరూరు తిరుగుచు పడరానిపాట్లు పడుచుంటిని, దారిద్ర్యము శమింపఁజేయు నుపా

యమేదైనగలదేని యూనతిండని వేడుకొనెను. స్వామి భూసురుని గాంచి ఓయీ! ఏలయిట్లు వెతపడెదవు సత్యనారాయణ వ్రత మొకటిగలదు, దానినాచరించి సంపదలనొందుమని దాని విధానము నెరిగించెను. బ్రాహ్మణుఁడును తానా మహాత్ముడు నుడివిన రీతినే తద్వ్రతమును భక్తి శ్రద్ధలతో నాచరించి అనేక సంపదలను వడసెను. ఆతడతిభక్తితో నావ్రతము ప్రతిమాస మాచరించుచుండెను. ఒకనాడా బ్రాహ్మణోత్తముడా వ్రతాచరణ మొనర్చుచునుండగా నొక కట్టెలనమ్ముకొనువాడదిగాంచి కట్టెలమోపును నేలబడవైచి భక్తితో నావ్రతకథ విని ప్రసాదమును భుజించి స్వామీ ఇదేమివ్రతము, దీనినాచరించుటవలన గలుగు ఫలమేమని యడిగెను. అపుడా విప్రుడోరీ! ఇది సత్యనారాయణవ్రతము దీనినాచరించుటవలన పేదరికము నశించును సకల సంపదలు సమకూరును. అభిలాషలంతరించునని నెను. అది విని యా కట్టెలమ్ముకొనువాడు, మరునాడుదయమున లేచి వ్రతాచరణము నొనర్పగాఁ దలంచి ఒక పెద్ద కట్టెలమోపును తలపైనిడుకొని ధనికులుండు చోటికిఁబోయి విక్రయించుటకుఁ బూనెను. వానికి స్వామియనుగ్రహమువలన నాదినమున వ్రతాచరణమునకు వలసినంత ధనములభించెను. దానితోవాడు వ్రతమునకు కావలసిన ద్రవ్యముల నన్నిటిని సంగ్రహించుకొని భక్తి శ్రద్ధలతో బాంధవులగూడి బ్రాహ్మణుల బిల్చి సత్యపూజనమాచరించెను. దానితోవాడు ధన పుత్రాన్వితుఁడై ఇహలోకమునందు సకల సుఖముల ననుభవించి పరలోకమున ముక్తి భోగములనుగూడి సుఖించెను.

ఇది ద్వితీయాధ్యాయము:

ఓం

శ్రీ సత్యదేవాయ నమః

శ్రీ వాగీశ్వర్యై నమః

# శ్రీ సత్యనారాయణ వ్రత కథ

## తృతీయాధ్యాయము

తే. గీ. మఱల నొక కథఁ దెల్పెద మౌనివర్యు
లార! నిశ్చలచిత్తులై మీరు వినుఁడు
తొల్లి యుల్కాముఖుండను దొడ్డనృపతి
యుండె సత్యవాది జితేంద్రియుం డతండు. 1

తే. గీ. అతఁ డహరహమ్ము దేవాలయమున కరిగి
పాఱులకు ధన మిమ్మిడి తృప్తి పఱచు చుండె,
నతని భార్య పద్మానన యందగత్తె
పతికి మిక్కిలి యనుకూలవతియు సతియు. 2

తే. గీ. భద్రశీలానదీతీర భాగమందు
సతిని గూడి యా నరపతి సత్యపూజ
నాచరించుచు నుండఁగా నచటి కపుడు
వచ్చె సాధునామకుఁ డగు వర్తకుండు. 3

క. వ్యాపారార్థము బహుళ ధ
నోపేతం బైన నావ నొగి తీరమునన్
స్థాపించి వ్రత మొనర్చెడి
భూపుని గని యడిగె వినయ భూషిత మతియై. 4

తే. గీ. భక్తి యుక్త చేతస్కులై ప్రభువరేణ్య!
తా మొనర్చెడి వ్రతఫలిత మ్మదేదొ?
వినఁగఁ గోరెద నెంతయు వేడ్కతోడఁ
దెలుపవే యన నరపతి పలికె నిట్లు. 5

క. సంతతిని గోరి నే భగ
వంతు నతులతేజు విష్ణువనజనయను సే
వింతు నిటు లనఁగ విని కడు
సంతసపడి సాదరముగ సాధువు పలికెన్. 6

ఆ. వె. నాకు సుతులు లేరు నరపాల! యీ వ్రతా
చరణ సంతు నిడుట సత్యమేని
నీ వ్రతమ్ము తప్పకే నొనర్చెద నంచు
దండ మిడెను వర్తకుండు భక్తి. 7

ఆ. వె. వర్తకం బొనర్చి వణిజుండు గృహమున
కరుగుదెంచి భార్య నరసి కూర్మి
సంతు నిచ్చు వ్రత విషయము నంతయు నావె
కెఱుకపఱచి పిదప నిటుల పలికె. 8

క. కాంతా! లీలావతిరో!
సంతానము మనకు హరి యొసంగినచోఁ గా
వింతము వ్రతమును నీ విఁక
చింతలఁ బనిలేదు నీదు చిత్తములోనన్. 9

క. అని యిరువు రొక్కఁ దినమున
మనసిజ కేళీవిలాస మగ్న హృదయులై
మనఁగ నెలదప్పె శ్రీదే
వుని కృప నాసతికి బూర్వపుణ్య వశమునన్. 10

క. ఎదిగి కడు పేర్పడియె నా
సుదతికి వేవిళ్ళుఁ బుట్టెఁ జూడంజూడన్
బదినెలలు మోసె నొకమం
చి దినమ్మున నామె కాఁడుచిన్నది గలిగెన్. 11

క. లీలావతి యొడి లోపల
బాలమణి పూర్ణకళల భాసిలఁగని తా
మాలోలాతులు బాలకు
నోలిఁగళావతి యటంచు నొకపేరిడుటన్. 12

క. అందముల కిక్కఁ రూపము
నందన నల చుక్కఁ దినదినాభివృద్ధిన్
సుందరి సిత పక్షమ్మునఁ
జందురు వలెఁ గానిపించె జనుల కనులకున్. 13

క. అప్పుడు లీలావతి తా
నిప్పగిది వచించె సుమధురేరితముల నో
యప్పా! మును మ్రొక్కిన వ్రత
మిప్పటికిని జేయవేమి హేతువొ చెపుమా? 14

క. అన సాధు వామె పరిణయ
మున నీ వ్రత మేనుజేతు మొత్తముపై ఖ
ర్చున ఖర్చు కలిసి వచ్చెడి
నని నిజసతి నూఱడించి యరిగె నగరికిన్. 15

తే. గీ. అప్పు డా కళావతి తండ్రి యాలయమునఁ
దోడి పిల్లలఁ గూడుచు నాడు కొనుచుఁ
బెరుఁగఁగని వర్తకుఁడు స్వనగరనివాసి
దూత నొకనిని బిల్చి యీరీతిఁ బల్కె. 16

క. ఇక్కన్నియకై నీ వొక
చక్కని వరుఁ జూచిరమ్ము చనుమని పంపన్
మ్రొక్కి ప్రభు నాజ్ఞగొని యతఁ
డకాంచననగరమునకు నరిగెను వెదకన్. 17

క. చని యా నగరమ్మున నొక
ధనికుని సుతుఁ దెచ్చి చూపెఁ దగిన వరుని; దాఁ
గనుగొని వణిజుం డా చ
క్కని బాలుని గుణినిఁ గన్యకకుఁ దగు నంచున్. 18

ఆ. వె. బిడ్డ నిచ్చి ప్రేమఁ బెండిలి యొనర్చెఁ
దరుణిఁ బిల్చి విధివిధాన మొప్పఁ
బరిణయమునఁ దన యభాగ్యవశమ్మున
మఱచె వ్రతము; కినుక మసలె ప్రభువు. 19

తే. గీ. అంత వాణిజ్యచణుఁ డయినట్టి సాధు
వొక్క తఱి నల్లునింగూడి యుదధితీర
మున మనెడి రత్నసాను పట్టణము నందు
నునికి సేసి వర్తకముఁ దా నొనరఁ జేయ. 20

తే. గీ. ఒక్క యెడ వారు చంద్రకేతూర్వీపాలు
దివ్యనగరమ్ము జనువేళ దేవుఁ డతని
నన్నమాటను దప్పె వీఁ డనుచు శాప
తప్తుఁ జేసె దారుణ దుఃఖతతిఁ బడు మని. 21

తే. గీ. ఆ దినము నందె తస్కరుం డర్ధరాత్రి
నృపతి విత్తమ్ము దొంగిలి కపట వృత్తి
సొలసి వర్తకుల్ నిదురించు చోటి కల్లి
యుఱికి వచ్చెను నృపభటుల్ తఱుము చుండ. 22

తే. గీ. అధిక ధనభారవశగతి నరుగ లేను
బట్టుఁబడెదను నే నని భయముఁ జెంది
ప్రభుని విత్తము నచ్చోటఁ బారవైచి
పారిపోయె వారికిఁ గనఁ బడని యట్లు. 23

క. అరుదెంచు నృపభటులు ని
ద్దుర వోయెడి సెట్టి పజ్జ దొరికిన విత్త
మ్మరసికొని వీరలే త
స్కరు లని బంధించి కొంచుఁ జనసాగి రొగిన్. 24

క. మురిపెమ్మున నులుకుచుఁ జని
ధరణీపుఁ గని వారిఁజూపి తా మని రిదె త
స్కరులను ధనయుతముగ మే
మిరువురఁ దెచ్చితిమి తెల్పుఁ డెది యాజ్ఞ ప్రభూ! 25

క. వారిఁ గని నృపతి, దొంగలు
వీ రగుదురొ కాదొ యనెడి వివర ముడిగి వే
కారాగార మ్మందునఁ
జేరుప విధియించె నటులె చేసిరి భటులున్. 26

క. చోరులము గాము రాజా!
బేరుల మయ్యా! యటంచు విల్లపింప వినం
డా రాజు సెట్టి ధనము న
పారముఁ గొనె దాఁట వశమె భగవన్మాయన్. 27

ఆ. వె. సత్యదేవ శాప సంతప్తుఁ డగు శెట్టి
యింటిలోని ధన మ దెల్ల నల్లె
దోఁచుకొనఁగఁ బడియె దొంగల గుంపుచే
వాని భార్య చాల వంతఁ గుందె. 28

క. ఆధి వ్యాధుల చేతన్
బాధం బడి వాని భార్య ప్రతిదినమున ను
ద్బాధార్తిఁ గడపకడప క
నాధననుచు బికిరమునకు నడయాడు వగన్. 29

తే. గీ. వాని బిడ్డ కళావతి తాను గూడఁ
దిరిపెమున కింటి కింటికిఁ దిరుగఁ దొడఁగె
నోపలేని యాఁకలి బాధఁ బాపుకొనఁగ
నెంచి యొకనాఁడు బ్రాహ్మణు నింటి కరిగె. 30

తే. గీ. అరిగి భక్తి మై నచ్చట జరుగు చున్న
సత్యదేవుని వ్రతము దర్శన మొనర్చి
యల్ల కూర్చుండి వ్రతకథ నవధరించి
వంతఁ బోనాడు మని వాని వరము వేఁడె. 31

తే. గీ. ఆ ప్రసాదము భుజియించి యర్ధరాత్రి
యిల్లు జేరె నప్పుడు దాని తల్లి గాంచి
కనుల నీర్నించి ప్రేమమై గారవించి
భారముగ నూర్పు విడిచి తాఁ బలికె నిట్లు. 32

క. ప్రాయము వచ్చిన దానవు,
ఈ యర్ధనిశీథ మందు నిటు తిరిగిన న
మ్మా! యే మందురు లోకులు
మాయునె యపకీర్తి యనిన మాత కిటు లనున్. 33

ఆ. వె. అమ్మ! నే ద్విజాలయమ్మున వాంఛలఁ
దీర్చు నట్టి సత్యదేవు వ్రతము
దర్శన మ్మొనర్పఁ దడ వయ్యె ననఁ దల్లి
మనము నా వ్రతమ్ము నొనరుత మనె. 34

తే. గీ. ఈశ్వరవ్రతమ్ము మఱచుట నింత వచ్చె
మనకు భ్రష్ట ప్రతిజ్ఞుల కనుచు సాధ్వి
యా వణిగ్భార్య ముదిత యై యాత్మబంధు
జనములం గూడి వ్రతసమాచరణ సేసె. 35

ఆ. వె. వ్రతము సేసి నాదు పతిని నా యల్లుని
తప్పు సైచి వేగఁ దరలి వచ్చు
నట్లు సేయు మింటి కని సత్యదేవుని
ప్రార్థన మ్మొనర్చె భక్తి మ్రొక్కి. 36

తే. గీ. ఆ వ్రతము తోడ సంతుష్టి నంది ప్రభువు
సత్యనారాయణుండు నా చంద్రకేతు
రాజునకు స్వప్నమందు దర్శన మొసంగి
పలికె నీ భంగి నాతండు భయము నంద. 37

క. భూపాలా! నీ బందియ
నేపుగ బంధింపఁ బడిన యీ బేరుల నీ
రేపే విడుపుము వారల
దో పూర్వధనమ్ము గొనిన దంతయు నిడుమీ! 38

క. లేని యెడ నాశ మొనరుతు
నే నిను ధన రాజ్యపుత్ర నిఖిలమ్ముగ నం
చా నరపతి స్వప్నమ్మునఁ
దా నెఱుఁగన్ బల్కి తీవ్రతన్ మఱుఁగయ్యెన్. 39

క. తెలవాటి నృపతి సభలోఁ
గల స్వజనమ్ములకుఁ గలను గాంచిన విషయ
మ్ములఁ దెలిపి బద్ధులౌ వణి
జుల నిప్పుడు విడువ వలయుఁ జుమి! యన వారున్. 40

క. నరపతి యాజ్ఞన్ వణిజుల
నిరువురఁ గొని వచ్చి యతని యెదుట నిలిపి భూ
వర! నిగళబంధ రహితుల
నెఱపుదు మని విన్నవించి నిలిచిరి భక్తిన్. 41

ఆ. వె. వేరు లపుడు రాజు వెనుకటి వృత్తాంత
మాత్మఁ దలఁచి భయము నంది మ్రొక్కి
కాళ్ళు వడఁకి యూఁడ గద్గదస్వర మొప్పఁ
బలుక నోరు రాక నిలిచి రంత. 42

క. నరపతి కోమటి బిడ్డలఁ
బరమాదర దృష్టిఁ గాంచి పచియించె నహో!
వెఱవకుఁడు మీకు నివి శ్రీ
హరికృప దప్పుటఁ గలిగె మహాదుఃఖమ్ముల్. 43

క. అని వారి కాళ్ళ సంకెల
లను వీడఁగఁ జేసి నృపుఁ డలఘు మతి క్షురక
ర్మను జేయించి సువస్త్రా
ల వలంకృతుల నిడి మన మలర మాటాడెన్. 44

క. లలిఁ దీయని మాటల వా
రల నిటు లోదార్చి వెన్క రాఁ బట్టిన డ
బ్బున కినుమడి నొసఁగి తమిన్
జను మనె నిజవసతి జేర సాధుయుగమ్మున్. 45

క. ఫాలతలమ్ములు సోఁక న్నృ
పాలకు పాదముల కెఱఁగి ప్రభువర్యా! మా
యేలిక వగు నీ కృపచే
నాలయమున కరుగు భాగ్య మబ్బె నటంచున్. 46

ఇది శ్రీ వానమామలై వరదాచార్య కృతం బగు
ఆంధ్ర సత్యవ్రత కల్పము నందు తృతీయాధ్యాయము.

---

## తృతీయాధ్యాయ కథ

సూతుడు శౌనకాది మునులగాంచి మరియొక కథ నిట్లు వచించెను.

ఓమునులారా! పూర్వకాలమున నుల్కాముఖుడను రాజొకడుండెను. అతడు ప్రజల బిడ్డలవలె గాపాడుచు జితేంద్రియుడై సత్యధర్మనిరతుడై బ్రాహ్మణులకు ధనమొసంగి సంతసింపజేసెడివాడు. వాని భార్య శీలవతియు పతివ్రతయునైన సుందరి.

వీరిరువురును భద్రశీలానదీతీరములో సత్యవ్రతమాచరించుచుండిరి. అపుడొక వర్తకుడు వ్యాపారార్థము బయలుదేరి యచ్చటకువచ్చి యావ్రతమును గాంచి తీర్థప్రసాదముల భుజించి యా వ్రత మాహాత్మ్యమునడిగి తెలిసికొని తాను నాచరింపదలచినవాడై యింటి కరుదెంచెను. సంతానములేని తన భార్యనుగాంచి యా వర్తకుడిటులనెను. ఓ ప్రియురాలా! నీవేల సంతానములేక చింతపడెదవు. సత్యనారాయణ వ్రతమునాచరించిన సకలవాంఛితములు నెరవేరగలవు ఒకవేళనీకు సంతానముగల్గిన మనముగూడ నావ్రతము నాచరింతము. అనిపలికిన కొంతకాలమునకు లీలావతి యనుపేర జెలంగు నవ్వర్తకుని భార్యకు గర్భమేర్పడి నవమాసములు గడచుటయు కూతురు జనించెను. ఆ వణిగ్భార్య వ్రతమాచరించుటకై భర్తతోమనవి నొనర్చెను. కాని వర్తకుడు తానా కన్యావివాహకాలమున వ్రతాచరణ సేయుదమని వాకొంచెను. పేరి, విదియనాటి చంద్రునివలె నెదుగుచున్న సుత యగు యా కళావతి యువతియై యుండుటగాంచి తగిన వరుని వెదకితెచ్చి వైభవముగా పెండ్లినొనర్చెను. వివాహసమయమున నాచరింతుననిన సత్యవ్రతమును మరచిపోయెను. యల్లుని గూడి వ్యాపారార్థమై వెడలి పోయెను. భ్రష్టప్రతిజ్ఞుడగు యా వర్తకునిగాంచి సత్యస్వామి గొప్ప దుఃఖము పొందగలవని శపించెను. మామయును నల్లుడును వ్యాపారార్థ మరిగి ఒక సముద్రతీరమున నాటిరేయి బరుండిరి. ఆ దేశపు రాజుగారి ధనమును దొంగిలించి చోరుడు వచ్చుచుండెను. రాజభటులు

వానివెంటబడిరి. ఆతడు పట్టుబడెదనను భీతితో ఆ ద్రవ్యమెల్ల నిదురించుచున్న వర్తకుని సమీపమున బడవైచి పరుగిడెను. రాజభటులు వచ్చి యావర్తకుల వద్ద రాజద్రవ్య ముండుట గని వీరేదొంగలని బంధించి తీసికొనిపోయి రాజాజ్ఞతో వారిని చెఱసాలనుంచిరి వారి ద్రవ్యమును గైకొని శోక్యసము నందిడిరి. సత్యదేవుని మాయవలన నావర్తకుని యింటిలో దొంగలు పడి ధనసర్వస్వము నపహరించిరి. ఆతని భార్య అధి వ్యాధి పీడిత యై క్షుధార్తయై ఇంటింటికి బిచ్చమెత్తుకొనుచుండెను. కలావతి యొకనాటి రాత్రి సత్యవ్రత ప్రసాదమును తెచ్చి తల్లికొసంగెను. లీలావతి దాని భుజించి ఇన్ని దుఃఖములకు మూల మీ సత్యవ్రత మాచరింపకుండుటయే యని గుర్తెరింగి శ్రమపడి మరునాడు వ్రత మొనర్చెను. ప్రభువు సంతసించి రాజు స్వప్నమున జని వర్తకులనువిడువుమని వారుదొంగలుగారని తెల్పెను. రాజు భయపడి వాని విడిపించి నూతన వస్త్రములిచ్చి, ఇమ్మడి ధనమునొసంగెను. వారును రాజుకు మ్రొక్కి బ్రాహ్మణుల పూజించి సంతోషముగ నింటికి వెడలిరి.

ఇది తృతీయాధ్యాయము.

శ్రీ

శ్రీ సత్యదేవాయ నమః
శ్రీ వాగీశ్వర్యై నమః

# శ్రీ సత్యనారాయణ వ్రత కథ

## చతుర్థాధ్యాయము



తే. గీ. మంగళాచార పూర్వక మహిత తీర్థ
యాత్రలను జేసి భగవాను నర్చ చేసి
బ్రాహ్మణులకు దక్షిణ లిడి వైశ్యులపుడు
తమ పురమ్మున కేఁగఁగాఁ దలఁచి రంత. 1

తే. గీ. అంబుధిని వారు కొంత ద వ్వరిగి నంత
సత్యనారాయణుండు విశ్వప్రభుండు
కపట సన్న్యాసి యై వారిఁ గాంచి తమిని
బలికె మీ యోడలో నేమి గల దటంచు. 2

తే. గీ. అపుడు మత్తులా వర్తకు లతనిఁ గాంచి
యవహసించుచుఁ దా మిట్టు లనిరి స్వామి!
మా ధన మ్మెంత దొంగిల మాయవేష
మును ధరించి మ మ్మిట్టుల మోసగింతె? 3

తే. గీ. ఆలకింపుము మా యోడ నాకు లలము
లున్న యవి యివి దప్ప డబ్బొకటి లేదు,
అనిన సన్న్యాసి యా పల్కు లాలకించి.
నగి తథాస్తని పలికె నన్నరులఁ గాంచి. 4

క. ఖలుల కిటు పలికి యతి తా
జలనిధి కిన్ గొంత దవ్వుఁ జని యచ్చోటన్
నిలిచి కను చుండె నట వై
శ్యులు నిత్యక్రియ లొనర్చి ఘోరిమి తోడన్. 5

క. తొలఁగించి యొడకప్పును
దిలకించిరి దాన నాకుదీఁగెలఁ గని రూ
కలఁ గాంచక విస్మితులై
యిలపైఁ బడి మూర్ఛ నొంది రిదియే మనుచున్? 6

క. కొంత వడి మూర్ఛ దెలిసి ని
తాంతము దుఃఖించె నురముఁదల బాఁదుచుఁ జెన్
వంతన్ వణిజుం, డల్లుఁడు
చెంత కరిగి నిజ మెఱిఁగి వచించె నిటు వలెన్. 7

క. ఎందుల కేడ్చెదు మామా!
సందేహము లేదు దరికిఁ జనుదెంచిన గో
వింద నిభుం డా యతి మన
నింద కలిగి మనల శాపనిహతులఁ జేసెన్. 8

క. చతురుఁడు సర్వసమర్థుం
డతనినె శరణమ్ము వేఁడి యాచించినచో
గత ధన మెల్లను జిక్కును
వెత నొందఁగ నేల శుభము వెలయు మన కనన్. 9

క. అల్లుని మాటలు విని మెల
మెల్లగ యతి దరికి నరిగి మిక్కిలి భక్తిన్
యుల్ల మలర మ్రొక్కెను ద
ప్పెల్లన్ క్షమియింపు త్రిభువనేశ్వర! యనుచున్. 10

క. పడి పడి మ్రొక్కుల నిడుచున్
గడు శోకం బొప్పఁ బాదకమలములఁ బడన్
ఎడఁద దయఁ దలఁచి యీ గతి
నుడివెను విపదబ్ధి మునిఁగి నొచ్చెడి శెట్టిన్. 11

క. విను మేద్వకు మస్మత్పా
జన మన విముఖుండ వగుటఁ బాపోపహతిన్
ఘన దుఃఖమ్ములఁ దేపకు
మునిఁగెదు నా శాపశస్త్రమున మ్రగ్గ దనన్. 12

క. విని భగవద్వాక్య మ్మిటు
లనుపమ గతి స్తుతి యొనర్ప నాయత్తుఁడై
సనకసనందనమునిజన
వినుతా! నిను బొగడలేని విమతిని శౌరీ! 13

క. అరయఁగ బ్రహ్మేంద్రామరు
లెఱుఁగరు విస్మయముఁ గొల్పు యీ నీరూపా
ద్యురు గుణముల నీ మాయా
పరవశులై, దాసుఁ డెంత వాఁడచటఁ బ్రభో! 14

తే. గీ. ఓ హరీ! ప్రసన్నుఁడవు గ మ్మొక్కసారి
మఱుఁగు పడిన ధనమ్ము నేఁ దిరిగి పొందు
నటు లనుగ్రహింప గదె విశ్వాత్మ! నిన్ను
శక్తివంచన లేక పూజన మొనర్తు. 15

క. వర పుండరీక నయనా!
శరణాగతు నన్ను రక్ష సలుపుమి యన నా
హరి కోరిన వర మిడి తాఁ
బరితృప్తిం బొంది మఱుఁగు పడె నచ్చటనే. 16

క. అత్తఱిఁ దా వైశ్యమె చని
విత్తముతో నిండు నావ వీక్షించి మహో
మత్తుండై యిది భగవ
త్సత్త యనుచు జనులఁ గూడి సలిపెను బూజల్. 17

తే. గీ. దరిసితిమి యిద్దొ మన రత్నపురిని గంటె
యనుచు నల్లునితోఁ బల్కి యమితతృప్తి
తొరఁగ నిజధనరక్షకున్ దూత నొకనిఁ
బంపె తనరాకఁ దెల్పఁగా భార్యకడకు. 18

ఆ. వె. సప్రముఁ దగుచు దూత నగర మ్మరిగి సెట్టి
జాయ నరసి భక్తిఁ దోయిలించి
యాత్మహితము గాఁగ ననె నిండు వాక్యమ్ము
కనుల నీరు జాఱ మనము లూర. 19

ఆ. వె. వచ్చె శెట్టి యూరి వద్దకు నల్లుని
తోడ బంధుజనముఁ గూడి నేఁడె
యనెడి దూత వాక్య మాలించి యాసతి
సత్యపూజ సలిపె స్వాంత ముబ్బ. 20

ఆ. వె. పూజ సల్పి నిజ తనూజతో నిటుఁ బల్కె
నమ్మ! మీదు తండ్రి యల్లుఁ గూడి
వచ్చె నంట యూరి వాకిటి కెంతేని
త్వరగ రమ్ము చూడ నరుగ వలెను. 21

ఆ. వె. అనెడి తల్లి మాట లాలించినంత న
వ్యాజ భక్తి సత్యపూజ సలిపి
హరిప్రసాద భుక్తి మఱచి యాపిల్ల తా
వెడలెఁ బతిని గాంచఁ గడు ముదమున. 22

క. అది గాంచి సత్యదేవుఁడు
మది రోష మ్మొంది దాని మగనిన్ ధన సం
పద నొప్పు పడవతో నీ
యదనుంగొని ముంచివైచె నంబుధిలోనన్. 23

క. తీర నివాసులు హా హా
కారము సేయుచు నిదేమి యాశ్చర్య మరో!
ఘోరము ఘోర మ్మని యా
నీరజనేత్రి వెత నరసి నీరయి రచటన్. 24

క. తీరనివాసులు తా మటు
ఘోరమ్ముగ వెతను జెందఁ గొమరిత నురమున్
జేరిచి లీలావతియు న
పారపు దుఃఖమున నేడ్చి భర్తకు ననియెన్. 25

క. కను చుండ నింతలో నే
మన యల్లునితోడ నోడ మాటు మణఁగె నె
ట్లనఘా! యిది యే దేవుని
ఘన మహాత్మ్యమ్మొ యెఱుఁగఁ గలఁ డెవ్వఁడిలన్? 26

క, కానున్న కాఁపుర మ్మిది
యో నీటం గలసె నెట్టు లోర్తును సుత దా
దీనావస్థను గన్గొని
దీనావనుఁడైన సత్యదేవు మహిమ యే. 27

క. ఇటు లని కూఁతును దన కౌఁ
గిటఁ జేరిచి యాపరాని ఖేదముతోఁ దా
నటఁ గల బంధుజన మ్మ
క్కటికం గొని చూడ రాలు గరఁగఁగ నేడ్చెన్. 28

క. తరుణి కళావతి తన దగు
వరుని వియోగమ్ము నోర్వ వశపడక పరా
త్పరుఁ దలఁచి మగని పాదుక
శిరమున ధరియించి జలధిఁ జేరఁగ నుఱికెన్. 29

క. ఆఁగు మటాఁగుము తల్లీ!
త్యాగ మొనర్పకుము నీదు తనువును, గోవున్
లేఁగ విడిచి పోయిన నది
యే గతి జీవించుఁ బ్రాణ మెట్లు ధరించున్. 30

ఆ. వె. అవశమైన వేళ నక్కఱ వత్తువు
కాలు సేతి కంచుఁ గలఁ గనెడి
నాన్న యమ్మ పుట్టి నట్టేట ముంచెదే
యెందుఁ గాని వయసు నందు నీవు. 31

ఆ. వె. అవని నాఁడబిడ్డ వైనను మగబిడ్డ
వైన నీవె యనుచు నాశ గొనెడి
ముసలి తల్లి దండ్రుల సుతామతల్లిరో!
యెవరి కొప్పగించి యేఁగు చుంటి? 32

క. అని సుతుని గాంచి వణిజుఁడు
తన మనమున సత్యదేవు ధ్యానించుచు దే
వుని మాయ వల్ల పోతము
మునిఁగిన దపరాధ మేమి పొనరించితిమో! 33

క. విభవానుకూలముగ నే
నభయప్రదుఁడైన దేవు నారాధింతున్
సభ వినఁ బలుకుదు నని యా
యిభ వరదుని గూర్చి మ్రొక్కె నిల నుదు టంటన్. 34

క. ఇక్కరణి సెట్టి ముక్కుకట
లక్కోమలి పలుకు నస్మదఘముల హరి తా
వక్కాణింపం డేటికి
మొక్కఁగఁ దలఁ గొట్టు దైవముంగలఁడె యిలన్? 35

ఆ. వె. పసుపు కుంకుమమ్ము పతితోడనే కాదె
మహి నలంక్రియలును మగని తోనె
భోగభాగ్యములును బూరుషుతోఁ గాదె
పతి విహీన కేల బ్రిదుకు లింక. 36

ఆ. వె. దేవరహిత మైన దేవాలయంబట్లు
ప్రాణహీన దేహభార మట్లు
భానురహిత గగన భాగంబు విధమునఁ
బతివిహీన మైన బ్రితుకు పాడు. 37

క. జననీ జనకుల కన్నను
ఘనుఁ డగు సద్గురుని కంటెఁ గమలజు కన్నన్
ధన ప్రాణ దాత కన్నన్
దన పతి ప్రాణంబు మిన్న తరుణీమణికిన్. 38

తే. గీ. అరయ సావిత్రిఁ గని భయ మందె యముఁడు
తలఁకి రనసూయఁ గని త్రిమూర్తులును భక్తి
సీతఁగని యగ్నిహోత్రిమున్ శీత మయ్యె
సతుల కపజయ మెందేని క్షితిని గలదె? 39

క. అని పతితో సహగమన
మ్మును జేయఁ దలంచు సతి యమోఘపుఁ బతి భ
క్తిని గని యా సత్యప్రభు
వనుపమ కృప గగనవాణి ననె నిటు తుష్టిన్. 40

క. మెచ్చితి నీ పతిభక్తికి
నిచ్చెద నీ కోరు వరము లిలపై నీ యీ
సచ్చరిత మెల్ల జనములు
నిచ్చలుఁ బఠియించఁ గీర్తి నెగడును బిడ్డా! 41

క. వచ్చెడి నీ పతి యనఁగనె
పొచ్చెడి తమి మత్ప్రసాద మిడఁ గుడువక యే
వచ్చితి, వింటికిఁ జని తిని
వచ్చిన నీ పతియు లేచి వచ్చు నిపు డనన్. 42

క. పరమాదరమున నింటికిఁ
ద్వరత్వర జని శెట్టి బిడ్డ త్యక్తప్రసాద
మ్మురు భక్తిఁ గుడిచి వచ్చినఁ
బరమామోదమ్ము నొందెఁ బరమేశ్వరుఁడున్. 43

క. మునిఁగిన నావయొ తీర
మ్మునఁ దేలెను దాన విత్తమును గూడి రహిన్
దన పెనిమిటి గనఁ బడియెను
మునిఁగె మహానందవార్ధి ముదిత యిటు లనెన్. 44

క. అయ్యా! తడయుఁగ నేటికి
నియ్యెడ మన మాలయమున కేఁగి మహార్తిన్
వెయ్యాఱు విధములన్ హరి
నయ్యమరేశ్వరుని భక్తి నర్చింప వలెన్. 45

క. అని యా మానిని ధనముం
గొని కూరిమిఁ బ్రాణనాథుఁ గూడి రమానా
థుని వ్రతము సల్పె మందిర
మున బంధు జనమ్ము గూడి ముదము జెలంగన్. 46

ఆ. వె. పౌర్ణమాస్య లందు భక్తిమై సంకాంతు
లందు సత్యపూజ లాచరించి
యిహము నందు సుఖము లెంతేనిఁ గుడుచుచుఁ
గడకు సత్యపురికి వెడలె నాపె. 47

ఇది శ్రీ వానమామలై వరదాచార్య కృతం బగు
ఆంధ్ర సత్య వ్రత కల్పమునందు చతుర్థాధ్యాయము.

---

## చతుర్థాధ్యాయ కథ

మరల సూతుడా కథ నిట్లు నుడువసాగెను. మును లారా! వర్తకుడు వ్యాపారయాత్ర ముగించుకొని తన నగరమునకు ప్రయాణమొనర్చెను. వారు పయనించు నావ సముద్ర తీరమును జేరుకొనెను. అపుడు సత్యదేవుడు సన్యాసి రూపమును

ధరించి వారినిగాంచి మీ నావయందేమున్నదని యడిగెను. అంతనా శేఠి యితడొక దొంగయై యుండునని శంకించి మా నౌకయందు ఆకులు తీవలు దక్క మరేమియు లేదని బొంకెను. అదివిని ప్రభువు నీ నౌకలో నాకులలములే యుండుగాక యని పల్కి చని కొంతదూరమునగల వృక్షముక్రింద గూర్చొనియుండెను. ఇంతలో భారవము తగ్గుటచే నీటిపై నౌక తేలికగా తేలియాడసాగెను, వర్తకుడిదేమియని పైకప్పు తెరిచి చూచెను ఆకులలములు దప్ప మరేమియు గనడయ్యెను. శిరము ఉరము బాదుకొనుచు బిగ్గరగా రోదింపసాగెను. అల్లుని ప్రేరణముతో తిరిగి యా సన్యాసివద్దకు చేరుకొని స్వామి నీమాయ నెరుగనైతిని. క్షమింపుము నా ధనమును నాకొసంగి దయజూడుమని వేడుకొనెను. స్వామికరుణించి తిరిగి నీ ధనములభించునని చెప్పి యదృశ్యుడయ్యెను. శేఠి తిరిగివచ్చి నౌకలో తన ధనముండుట గని సంతసించి తాముచ్చిన వర్తమానము దూతద్వారా ఇంటికి బంపెను. అదివిని తల్లిబిడ్డలిరువురు మిక్కిలి సంతసించి వారొనర్చుకొనుచున్న సత్యవ్రతమును ముగించుకొని త్వరగా వెడలిరి. వీరు వెడలుటయు పెను గాలివానతో సముద్రమునందున్న నావ ధనముతోపాటు శేఠి యల్లునితోపాటు సముద్రమునందు మునిగిపోయెను. కళావతి తన పతితో సముద్రమున నౌక మునుగుట గాంచి దుఃఖము భరింపలేక పతి పాదుకలు తల ధరించి తానును సముద్రమున బడుటకై యురికెను. తీరవాసులెల్ల హాహా కార

ములోనర్చిరి. తలిదండ్రులు దుఃఖసాగరమున మునిగినవారలై కూతును బలురీతులు వారించిరి. కాని కళావతి వినదయ్యెను. అప్పు డాకాశవాణి యిట్లనెను. ఓ కళావతీ! నీవు సత్యవ్రత మాచరించి పతి వచ్చినాడను సంతోష వార్తవిని స్వామి ప్రసాదమును స్వీకరింపకనే త్వరపడి వచ్చితివి. నీవింటికి వెడలి సత్య ప్రసాదమును భుజించి తిరిగివచ్చినచో నీ పతి మరియు ధనము తోగూడ నోడ సురక్షితముగా తీరమునకు జేరునని వచించెను. అదివిని సకలజనములు సంతసించిరి. కళావతి వడిగాజని ప్రసాద స్వీకారమొనర్చి జలధి తీరమునకువచ్చి చూచునంతకు ఓడ సముద్రతీరమునకు జేరుకొని యుండెను. అందలి ధనము మరి యు తన నాథుడు సురక్షితముగా నుండుటగాంచి యిది యంతయు సత్యదేవుని మాహాత్మ్యమని తెలిసికొని తలిదండ్రులతో గూడి పతితోపాటు నెల నెలకు సత్యవ్రతము నాచరించుచు ఇహపర సుఖముల గడించెను.

ఇది చతుర్థాధ్యాయము.

శ్రీ సత్యదేవాయ నమః
శ్రీ వాగీశ్వర్యై నమః

# శ్రీ సత్యనారాయణ వ్రత కథ

## పంచమాధ్యాయము

ఆ. వె. మౌని వర్యులార! మఱియొక కథ నేను
జెప్పు చుంటి వినుఁడు చిత్తమలరఁ
బ్రజల బిడ్డ లట్లు పాలించు తుంగధ్వ
జుఁ డను రాజొకండు సుమతి యగుచు. 1

క. ఒకసారి వేఁట కని యడ
వికి నేఁగి మృగాళి నెల్ల వేధించి యొకిం
చుక బడలికఁ దీర్చుకొనన్
నికటస్థిత బిల్వవృక్షు నివసతిఁ జేరెన్. 2

ఆ. వె. తమిని గొల్లలచటఁ దమ బంధువులఁ గూడి
సత్యపూజనమ్ము సలుపఁ గాంచి
దఱియ నరిగి రాజు దర్పసమేతుఁడై
హరిని గాంచి మ్రొక్కఁ డయ్యె భక్తి. 3

క. భూపాలుని గని భక్తిని
గోపతతి ప్రసాద మార్తి గొని చని యిడి, రా
గోపాలురఁ గని నవ్వుచు
భూపాలుఁడు మీకు దేవ పూజలె యనియెన్. 4

క. కులహీను లిడు ప్రసాద
మ్ములఁ గుడతురె యోగ్యు లెందు మూర్ఖు లయిన మీ
ర లిడు ప్రసాదము నే నెటు
గుడుతు ననుచు విడిచిపెట్టె క్షోణీపతియున్. 5

క. విడిచిన తత్క్షణ మచటికి
వడి వార్తాహరుఁ డొకండు వచ్చి మహీశా!
కొడుకులు మూర్ఖురు నరిచేఁ
బడిరి ధన మ్మెల్ల దోఁచఁబడె నే మందున్. 6

క. అరరే! సత్యప్రసాదము
పరి త్యజించితిని బాధఁ బడితి నటంచున్
నరపాలుఁడు హరి పూజలు
వఱలెడి స్థలమునకె యేఁగవలె నని తలఁచెన్. 7

క. మనమున నిటు నిశ్చయమున్
బొనరిచి గోపాలు రుండు పుణ్యక్షేత్ర
మ్మున కరిగి సత్యపూజన
మును విధి విహితముగ భక్తిపూర్ణుం డగుచున్. 8

ఆ. వె. చేయు చుండ నటకుఁ జేరఁగా వచ్చువా
ర్తాహరుం డొకండు రాజుఁ గాంచి
యెఱఁగి పల్కె స్వామి యే మందు నీ పుత్రు
లరులఁ గెల్చి రాజ్య మంది రనుచు. 9

క. ఔందమునం దానందము
నొంది నృపాలుండు మిగుల నుత్సాహముతో
సందేహ మేల హరి కృప
నందితి మీ రాజ్య మనుచు నరిగెను బురికిన్. 10

క. ఈ లోకమ్మున సుఖమును
శ్రీలును శాశ్వతము గాఁగ శ్రీపతి తోడన్
సాలోక్యమ్మును గనె భూ
పాలుఁడు సత్యప్రభుని కృపాలేశమునన్. 11

ఆ. వె. పరమ దుర్లభంబు దురిత హరం బగు
సత్యపూజనమ్ము సలుపు వాఁడు
భుక్తి ముక్తి నిచ్చు పుణ్య చారిత్రంబు
వినఁ దరింపఁగోరు విబుధుఁ డెందు. 12

క. శుష్క దరిద్రుఁడు కాంచన
నిష్కమ్ములఁ దూఁగు చెఱల నిర్బంధితుఁ డౌ
ముష్కరుఁడు ముక్తుఁడై మని
పుష్కల ధనధాన్యములను బొందు హరి కృపన్. 13

క. భీరువు భయము లడంగును
గోరిన ఫలములును వానిఁ గూడును దుదకున్
జేరును సత్యపురమ్మును
నారాయణు వ్రతము కూర్చు నరులకు శుభముల్. 14

ఆ. వె. సంయ మీంద్రులార! సత్యనారాయణ
వ్రతముఁ గూర్చి మీకుఁ గుతుక మొందఁ
దెలిపినాఁడ దేని సలిపి మానవుఁడు తా
నిఖిల దుఃఖ ముక్తి నెగడు వాఁడొ. 15

ఆ. వె. నరులు భువిని సత్యనారాయణుం డని
కొంద అందు రింకఁ గొంద రతని
సత్యదేవుఁ డంచుఁ జాటుచు నుందురు
కలి నిదే విశేష ఫలద పూజ. 16

ఆ. వె. హరి సనాతనుండు నఖిల రూపుఁడు కోర్కె
పూర్తి సేయు సత్యమూర్తి యగుచు
గథను విన్న వ్రతముఁ గాంచినన్ వారికి
పాపరాశి యడఁగు వరదు కృపను. 17

క. హరి కర్పణమ్ముగా నిది
వరదకవి రచించె నాంధ్రభాషన్ సత్యే
శ్వరు వ్రతకల్ప కథావళి
వర భక్తిన్ జదువ వినఁగ వాంఛితము లిడున్. 18

ఇది శ్రీ వానమామలై వరదాచార్య కృతం బగు
అంధ్ర సత్యవ్రత కల్పము నందు పంచమాధ్యాయమును
సర్వంబును సంపూర్ణము.

---

# పంచమాధ్యాయ కథ

మరల సూతుడు శౌనకాది మునులకు మరియొక కథ నిట్లని నుడువసాగెను.

మునులారా! పూర్వము తుంగధ్వజుడను రాజొకడుండెను. అతడు ప్రజల ననురాగముతో పాలించుచుండెను. ఒక మారతడు వేటాడుటకై వనమునకు వెడలెను. అనేక మృగముల వేటాడి యలసటనొంది వచ్చి యొక మారేడు చెట్టునీడలో విశ్రమించి యచ్చట కొందరు గోప కుమారులు సత్యవ్రత మాచరించుట గాంచెను. వారును రాజు దేవునివలె వచ్చినాడని భక్తి శ్రద్ధలతో సత్య ప్రసాదమును గొని చని సమర్పించిరి. రాజు వారిని ధిక్కరించి ప్రసాదమును తిరస్కరించెను. ఇంతలో నతని నూరుగురు కుమారులు ధనధాన్యాదులు నష్టమందెనని ఒక వార్తాహరుడరుదెంచి తెల్పెను. అపుడు రాజు గర్వముడిగి ఇది సత్యప్రసాద పరిత్యాగమువలన గలిగిన యాపదయేయని తెలిసికొని మరల నా గోపకుమారుల నందరిబిల్చి వారితోపాటు సత్యవ్రత మాచరించి స్వామిని వేడెను. స్వామి యపార కృపా మహిమతో నా నరపాలుని కుమారులు నూరుగురు ధనధాన్యములతోపాటు బ్రతికి బయటపడిరి. అంత రాజు ఇదియంతయు సత్యదేవ మహిమయని తెలిసి మాస మాసము సత్యవ్రతమాచరించుచు నిహపరసుఖ సంపదల బొందెను.

కావున నో మునులారా! యెవరీ సత్యవ్రతము నాచరింతురో వారికి భుక్తి ముక్తులు కర తలామలకములగును. చేయశక్తి లేకున్న నీ కథనైన విని సత్యప్రసాద స్వీకారము నొనర్చినవారును, దరిద్రులు ధనవంతులయ్యెదరు బద్ధుడు భీతుడు భయపీడ నుండి ముక్తుడగును. ఈవిషయ మత్యంత సత్యము. సంశయమువలదు. కలికాలమున సత్యపూజకన్న ఇహాపర సుఖప్రదమైన సులభోపాయము లేదు.

కథవిన్నను వ్రతమొనర్చినను వారి పాపములు నశించును వారి దుఃఖములు తొలగును. సత్యదేవ మహానుగ్రహము వలన సకల సుఖముల బడయగలరు.

ఇది పంచమాధ్యాయము.



## పునః పూజా

పునః ప్రాణాయమ్య:—

శ్రీ సత్యనారాయణ ముద్దిశ్య శ్రీ సత్యనారాయణ స్వామి ప్రీత్యర్థం శ్రీ సత్యనారాయణ స్వామినః పునః పూజాం కరిష్యే, శ్రీ సత్యనారాయణ స్వామినే నమః, ధ్యాయామి, ఆవాహయామి, రత్న సింహాసనం సమర్పయామి, పాదయోః పాద్యం సమర్పయామి, హస్తయోరర్ఘ్యం సమర్పయామి, స్నపయామి, శుద్ధాచమనీయం సమర్పయామి, వస్త్ర యుగ్మం సమర్పయామి, యజ్ఞోపవీతం సమర్పయామి, దివ్య శ్రీచందనం సమర్పయామి, అక్షతాన్ సమర్పయామి, నానావిధ పుష్పాణి పూజయామి.

ఓం కేశవాయ నమః,........................ ధూపమాఘ్రాపయామి, దీపం దర్శయామి, ధూప దీపానంతర మాచమనీయం సమర్పయామి.

## నైవేద్యం

ఓం భూర్భువస్సువః................ప్రచోదయాత్ సత్యం త్వర్తేన పరిషించామి, శ్రీ సత్యనారాయణ స్వామినే అమృత మస్తు, అమృతోపస్తరణ మసి, ఓం ప్రాణాయ స్వాహా —సమానాయస్వాహా, మధ్యమధ్యే పానీయం సమర్పయామి. అమృతాపిధాన మసి ఉత్తరా పోశనం సమర్పయామి,

తాంబూలం సమర్పయామి, సువర్ణ మంత్రపుష్పం సమర్ప యామి, ప్రదక్షిణ నమస్కారాన్ సమర్పయామి, అనయా ధ్యానావాహనాది షోడశోపచార పూజయా భగవాన్ సర్వా త్మకః శ్రీ సత్యనారాయణ స్వామీ సుప్రీత సుప్రసన్నో వరదో భవతు.

శ్రీ సత్యనారాయణ ప్రసాదం శిరసాగృహ్ణామి.

## ఉద్వాసనం

యజ్ఞేనయజ్ఞ మయజంత దేవాః తాని ధర్మాణి ప్రథమా న్యాసన్ తేహనాకం మహిమానస్సచంతే యత్రపూర్వే సాధ్యాస్సంతిదేవాః.

పునః ప్రాణాయామ్య:—

పరమేశ్వర ప్రీత్యర్థం స్వర్ణ స్వర్చిత ప్రతిమా మంటప దానం కరిష్యే.

శ్రీ సత్యనారాయణ స్వరూపస్య బ్రాహ్మణస్య ఉభ భ్యాం పాద్యం.

నమోస్త్వనంతాయ సహస్ర మూర్తయే
సహస్ర పాదాక్షి శిరోరు బాహవే
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీ యుగధారిణే నమః

శ్రీ సత్యానారాయణ స్వరూపస్య బ్రాహ్మణస్య గంధం, అక్షతాః, పుష్పాణి, అస్మై బ్రాహ్మణాయ యజుశ్శాఖాధ్యాయినే ................ గోత్రాయ ................ శర్మణే ప్రతి గ్రహీత్రే శ్రీమాన్ గోత్రః................ నామధేయః ధర్మ పత్నీ సమేతోఽహం గోత్రస్య నామధేయస్య ధర్మ పత్నీ సమేతస్య మమో పాత్త దురితక్షయ ద్వారా శ్రీ పరమేశ్వర ప్రీత్యర్థం సత్యానారాయణ స్వర్ణ స్వర్చిత ప్రతిమా మంటపం తుభ్యమహం సంప్రదదే నమమ. దేవస్య త్వాసవితుః ప్రసవేశ్వినోర్బాహుభ్యాం పూష్ణో హస్తాభ్యాం ప్రతి గృహ్ణామి. వశ్శ్రియసే ప్రతి గృహ్ణామి.ఏ తద్దాన సాద్గుణ్యార్థం యథాశక్తి దక్షిణాం తుభ్యమహం సంప్రదదే న మమ.

శ్రీ సత్యానారాయణ వ్రితకల్పము.

సమాప్తము

శ్రీరస్తు

# శ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామావళిః



ఓం ప్రకృత్యై నమః
వికృత్యై నమః
విద్యాయై నమః
సర్వభూత హిత
ప్రదాయై నమః
శ్రద్ధాయై నమః
విభూత్యై నమః
సురభ్యై నమః
పరమాత్మికాయై నమః
వాచే నమః
పద్మాలయాయై నమః
పద్మాయై నమః
శుచయే నమః
స్వాహాయై నమః
స్వధాయై నమః
సుధాయై నమః
ధన్యాయై నమః
హిరణ్మయై నమః
లక్ష్మ్యై నమః
నిత్య పుష్టాయై నమః

ఓం విభావర్యై నమః
అదిత్యై నమః
దిత్యై నమః
దీప్తాయై నమః
వసుధాయై నమః
వసుధారిణ్యై నమః
కమలాయై నమః
కాంతాయై నమః
కామాక్ష్యై నమః
క్రోధ సంభవాయై నమః
అనుగ్రహపదాయై నమః
బుద్ధయే నమః
అనఘాయై నమః
హరివల్లభాయై నమః
అశోకాయై నమః
అమృతాయై నమః
దీప్తాయై నమః
లోకశోకవినాశిన్యై
నమః
ధర్మనిలయాయై నమః

ఓం కరుణాయై నమః
లోకమాత్రే నమః
పద్మప్రియాయై నమః
పద్మహస్తాయై నమః
పద్మాక్ష్యై నమః
పద్మసుందర్యై నమః
పద్మోద్భవాయై నమః
పద్మముఖ్యై నమః
పద్మనాభప్రియాయై నమః
రమాయై నమః
పద్మమాలాధరాయై నమః
ఓం దేవ్యై నమః
పద్మిన్యై నమః
పద్మగంధిన్యై నమః
పుణ్యగంధాయై నమః
సుప్రసన్నాయై నమః
ప్రసాదాభిముఖ్యై నమః
ప్రభాయై నమః
చంద్రవదనాయై నమః
చంద్రాయై నమః
చంద్రసహోదర్యై నమః
చతుర్భుజాయై నమః
చంద్రరూపాయై నమః

ఓం ఇందిరాయై నమః
ఇందుశీతలాయై నమః
ఆహ్లోదజనన్యై నమః
తుష్ట్యై నమః
శివాయై నమః
శివకర్యై నమః
సత్యై నమః
విమలాయై నమః
విశ్వజనన్యై నమః
తుష్టయే నమః
దారిద్ర్యనాశిన్యై నమః
ప్రీతి పుష్కరిణ్యై నమః
శాంతాయై నమః
శుక్లమాల్యాంబరాయై నమః
శ్రియై నమః
భాస్కర్యై నమః
బిల్వనిలయాయై నమః
వరారోహాయై నమః
యశస్విన్యై నమః
వసుంధరాయై నమః
ఉదారాంగాయై నమః
హరిణ్యై నమః
హేమమాలిన్యై నమః
ధనధాన్యకర్యై నమః

ఓం సిద్ధయే నమః
స్త్రైణసౌమ్యాయై నమః
శుభప్రదాయై నమః
నృపవేశ్మగతానందాయై నమః
వరలక్ష్మ్యై నమః
వసుప్రదాయై నమః
శుభాయై నమః
హిరణ్యప్రాకారాయై నమః
సముద్రతనయాయై నమః
జయాయై నమః
మంగళాయై నమః
దేవ్యై నమః
విష్ణువక్షస్థలస్థితాయై నమః

ఓం విష్ణుపత్న్యై నమః
ప్రసన్నాక్ష్యై నమః
నారాయణసమాశ్రితాయై నమః
దారిద్ర్య ధ్వంసిన్యై నమః
దేవ్యై నమః
సర్వోపద్రవ వారిణ్యై నమః
నవదుర్గాయై నమః
మహాకాళ్యై నమః
బ్రహ్మవిష్ణు శివాత్మికాయై నమః
త్రికాలజ్ఞాన సంపన్నాయై నమః
భువనేశ్వర్యై నమః

శ్రీ లక్ష్మ్యష్టోత్తర శతనామావళిః
సంపూర్ణం



శ్రీరస్తు

# శ్రీ విష్ణ్వష్టోత్తర శతనామావళిః

ఓం నారాయణాయ నమః
నరాయ నమః
శౌరయే నమః
చక్రపాణయే నమః
జనార్దనాయ నమః
వాసుదేవాయ నమః
జగద్యోనయే నమః
వామనాయ నమః
జ్ఞాన పంజరాయ నమః
శ్రీ వల్లభాయ నమః 10
జగన్నాథాయ నమః
చతుర్మూర్తయే నమః
వ్యోమకేశాయ నమః
హృషీకేశాయ నమః
శంకరాయ నమః
గరుడధ్వజాయ నమః
నారసింహాయ నమః
మహాదేవాయ నమః
ఓం స్వయంభువే నమః
భువనేశ్వరాయ నమః 20
శ్రీధరాయ నమః
ఓం దేవకీ పుత్రాయ నమః
పార్థసారథయే నమః
అచ్యుతాయ నమః
శంఖపాణయే నమః
పరంజ్యోతిషే నమః
ఆత్మజ్యోతిషే నమః
అచంచలాయ నమః
శ్రీవత్సాంకాయ నమః
అఖిలాధారాయనమః 30
సర్వలోకపతిప్రభవే
త్రివిక్రమాయ నమః
త్రికాలజ్ఞానాయ నమః
త్రిధామ్నే నమః
కరుణాకరాయ నమః
సర్వజ్ఞాయ నమః
ఓం సర్వగాయ నమః
సర్వస్మై నమః
సర్వేశాయ నమః
సర్వసాక్షికాయనమః 40
హరయే నమః
శార్ఙిణే నమః

ఓం హరిణే నమః
శేషాయ నమః
హలాయుధాయ నమః
సహస్రబాహవే నమః
అవ్యక్తాయ నమః
సహస్రాక్షాయ నమః
అక్షరాయ నమః
క్షరాయ నమః 50
గజారిఘ్నాయ నమః
కేశవాయ నమః
కేశిమర్దనాయ నమః
కైటభారయే నమః
అవిద్యారయే నమః
కామదాయ నమః
కమలేక్షణాయ నమః
హంసశత్రవే నమః
అధర్మశత్రవే నమః
కాకుత్స్థాయ నమః 60
ఖగవాహనాయ నమః
నీలాంబుదద్యుతయే నమః
నిత్యాయ నమః
నిత్యతృప్తాయ నమః
నిత్యానందాయ నమః
సురాధ్యక్షాయ నమః

ఓం నిర్వికల్పాయ నమః
బ్రహ్మణ్యాయ నమః
పృథివీనాథాయ నమః
పీతవాససే నమః 70
గుహాశ్రయాయ నమః
వేదగర్భాయ నమః
విభవే నమః
విష్ణవే నమః
శ్రీమతే నమః
త్రైలోక్యభూషణాయ నమః
యజ్ఞమూర్తయే నమః
అమేయాత్మనే నమః
వరదాయ నమః
వాసవానుజాయ నమః
జితేంద్రియాయ నమః
జితక్రోధాయ నమః
సమదృష్టయే నమః
సనాతనాయ నమః
భక్తప్రియాయ నమః
జగత్పూజ్యాయ నమః
పరమాత్మనే నమః
అసురాంతకాయ నమః
సర్వలోకానామంతకాయ నమః 90

ఓం అనంతాయ నమః
అనంతవిక్రమాయ నమః
మాయాధారాయ నమః
నిరాధారాయ నమః
సర్వాధారాయ నమః
ధరాధరాయ నమః
నిష్కళంకాయ నమః
నిరాభాసాయ నమః
నిష్ప్రపంచాయ నమః
నిరామయాయనమః 100
భక్తవశ్యాయ నమః
మహోదరాయ నమః
పుణ్యకీర్తయే నమః
పురాతనాయ నమః
త్రికాలజ్ఞాయ నమః
విష్టరశ్రవసే నమః
చతుర్భుజాయ నమః

శ్రీ సత్యనారాయణస్వామినే నమః
నానావిధ పరిమళ పుష్పాణి సమర్పయామి.

---

# శ్రీ విష్ణు సహస్ర నామావళిః

ఓం విశ్వస్మై విశ్వాయ నమః
ఓం విష్ణవే నమః
ఓం వషట్కారాయ నమః
ఓం భూతభవ్యభవత్ప్రభవే నమః
ఓం భూతకృతే నమః
ఓం భూతభృతే నమః
ఓం భావాయ నమః
ఓం భూతాత్మనే నమః
ఓం భూతభావనాయ నమః
ఓం పూతాత్మనే నమః 10
ఓం పరమాత్మనే నమః
ఓం ముక్తానాం పరమాగతయే నమః
ఓం అవ్యయాయ నమః
ఓం సాక్షిణే నమః
ఓం పురుషాయ నమః
ఓం క్షేత్రజ్ఞాయ నమః
ఓం అక్షరాయ నమః
ఓం యోగాయ నమః
ఓం యోగవిదాంనేత్రే నమః

ఓం ప్రధానపురుషేశ్వరాయ నమః 20
ఓం నారసింహవపుషే నమః
ఓం శ్రీమతే నమః
ఓం కేశవాయ నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం సర్వస్మై (సర్వాయ) నమః
ఓం శర్వాయ నమః
ఓం శివాయ నమః
ఓం స్థాణవే నమః
ఓం భూతాదయే నమః
ఓం నిధయే నమః 30
ఓం అవ్యయాయ నమః
ఓం సంభవాయ నమః
ఓం భావనాయ నమః
ఓం భర్త్రే నమః
ఓం ప్రభవాయ నమః
ఓం ప్రభవే నమః
ఓం ఈశ్వరాయ నమః
ఓం స్వయంభువే నమః
ఓం శంభవే నమః
ఓం ఆదిత్యాయ నమః 40
ఓం పుష్కరాక్షాయ నమః
ఓం మహాస్వనాయ నమః
ఓం అనాదినిధనాయ నమః
ఓం ధాత్రే నమః
ఓం విధాత్రే నమః
ఓం ధాతురుత్తమాయ నమః
ఓం అప్రమేయాయ నమః
ఓం హృషీకేశాయ నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం అమరప్రభవే నమః 50
ఓం విశ్వకర్మణే నమః
ఓం మనవే నమః
ఓం త్వష్ట్రే నమః
ఓం స్థవిష్ఠాయ నమః
ఓం స్థవిరాయ ధ్రువాయ నమః
ఓం అగ్రాహ్యాయ నమః
ఓం శాశ్వతాయ నమః
ఓం కృష్ణాయ నమః
ఓం లోహితాక్షాయ నమః
ఓం ప్రతర్దనాయ నమః 60
ఓం ప్రభూతాయ నమః
ఓం త్రికకుద్ధామ్నే నమః
ఓం పవిత్రాయ నమః
ఓం పరస్మై మంగళాయ నమః
ఓం ఈశానాయ నమః
ఓం ప్రాణదాయ నమః
ఓం ప్రాణాయ నమః
ఓం జ్యేష్ఠాయ నమః
ఓం శ్రేష్ఠాయ నమః
ఓం ప్రజాపతయే నమః 70
ఓం హిరణ్యగర్భాయ నమః
ఓం భూగర్భాయ నమః
ఓం మాధవాయ నమః
ఓం మధుసూదనాయ నమః
ఓం ఈశ్వరాయ నమః
ఓం విక్రమిణే నమః
ఓం ధన్వినే నమః
ఓం మేధావినే నమః
ఓం విక్రమాయ నమః
ఓం క్రమాయ నమః 80
ఓం అనుత్తమాయ నమః
ఓం దురాధర్షాయ నమః
ఓం కృతజ్ఞాయ నమః
ఓం కృతయే నమః

ఓం ఆత్మవతే నమః
ఓం సురేశాయ నమః
ఓం శరణాయ నమః
ఓం శర్మణే నమః
ఓం విశ్వరేతసే నమః
ఓం ప్రజాభవాయ నమః 90
ఓం అహ్నే నమః
ఓం సంవత్సరాయ నమః
ఓం వ్యాళాయ నమః
ఓం ప్రత్యయాయ నమః
ఓం సర్వదర్శనాయ నమః
ఓం అజాయ నమః
ఓం సర్వేశ్వరాయ నమః
ఓం సిద్ధాయ నమః
ఓం సిద్ధయే నమః
ఓం సర్వాదయే నమః 100
ఓం అచ్యుతాయ నమః
ఓం వృషాకపయే నమః
ఓం అమేయాత్మనే నమః
ఓం సర్వయోగవినిస్సృతాయ నమః
ఓం వసవే నమః
ఓం వసుమనసే నమః
ఓం సత్యాయ నమః
ఓం సమాత్మనే నమః
ఓం అసమ్మితాయ నమః
ఓం సమాయ నమః 110
ఓం అమోఘాయ నమః
ఓం పుండరీకాక్షాయ నమః
ఓం వృషకర్మణే నమః
ఓం వృషాకృతయే నమః
ఓం రుద్రాయ నమః
ఓం బహుశిరసే నమః

ఓం బభ్రవే నమః
ఓం విశ్వయోనయే నమః
ఓం శుచిశ్రవసే నమః
ఓం అమృతాయ నమః 120
ఓం శాశ్వతాయస్థాణవే నమః
ఓం వరారోహాయ నమః
ఓం మహాతపసే నమః
ఓం సర్వగాయ నమః
ఓం సర్వవిదే భానవే నమః
ఓం విష్వక్సేనాయ నమః
ఓం జనార్ధనాయ నమః
ఓం వేదాయ నమః
ఓం వేదవిదే నమః
ఓం అవ్యంగాయ నమః 130
ఓం వేదాంగాయ నమః
ఓం వేదవిదే నమః
ఓం కవయే నమః
ఓం లోకాధ్యక్షాయ నమః
ఓం సురాధ్యక్షాయ నమః
ఓం ధర్మాధ్యక్షాయ నమః
ఓం కృతాకృతాయ నమః
ఓం చతురాత్మనే నమః
ఓం చతుర్వ్యూహాయ నమః
ఓం చతుర్దంష్ట్రాయ నమః 140
ఓం చతుర్భుజాయ నమః
ఓం భ్రాజిష్ణవే నమః
ఓం భోజనాయ నమః
ఓం భోక్త్రే నమః
ఓం సహిష్ణవే నమః
ఓం జగదాదిజాయ నమః
ఓం అనఘాయ నమః
ఓం అజయాయ నమః
ఓం జేత్రే నమః

ఓం విశ్వయోనయే నమః 150
ఓం పునర్వసవే నమః
ఓం ఉపేంద్రాయ నమః
ఓం వామనాయ నమః
ఓం ప్రాంశవే నమః
ఓం అమోఘాయ నమః
ఓం శుచయే నమః
ఓం ఊర్జితాయ నమః
ఓం అతీంద్రాయ నమః
ఓం సంగ్రహాయ నమః
ఓం సర్గాయ నమః 160
ఓం ధృతాత్మనే నమః
ఓం నియమాయ నమః
ఓం యమాయ నమః
ఓం వేద్యాయ నమః
ఓం వైద్యాయ నమః
ఓం సదాయోగినే నమః
ఓం వీరఘ్నే నమః
ఓం మాధవాయ నమః
ఓం మధవే నమః
ఓం అతీంద్రియాయ నమః 170
ఓం మహామాయాయ నమః
ఓం మహోత్సాహాయ నమః
ఓం మహాబలాయ నమః
ఓం మహాబుద్ధయే నమః
ఓం మహావీర్యాయ నమః
ఓం మహాశక్తయే నమః
ఓం మహాద్యుతయే నమః
ఓం అనిర్దేశ్యవపుషే నమః
ఓం శ్రీమతే నమః
ఓం అమేయాత్మనే నమః 180
ఓం మహాద్రిధృతే నమః
ఓం మహేష్వాసాయ నమః

ఓం మహీభర్త్రే నమః
ఓం శ్రీనివాసాయ నమః
ఓం సతాంగతయే నమః
ఓం అనిరుద్ధాయ నమః
ఓం సురానందాయ నమః
ఓం గోవిందాయ నమః
ఓం గోవిదాంపతయే నమః
ఓం మరీచయే నమః 190
ఓం దమనాయ నమః
ఓం హంసాయ నమః
ఓం సువర్ణాయ నమః
ఓం భుజగోత్తమాయ నమః
ఓం హిరణ్యనాభాయ నమః
ఓం సుతపసే నమః
ఓం పద్మనాభాయ నమః
ఓం ప్రజాపతయే నమః
ఓం అమృత్యవే నమః
ఓం సర్వదృశే నమః 200
ఓం సింహాయ నమః
ఓం సంధాత్రే నమః
ఓం సంధిమతే నమః
ఓం స్థిరాయ నమః
ఓం అజాయ నమః
ఓం దుర్మర్షణాయ నమః
ఓం శాస్త్రే నమః
ఓం విశ్రుతాత్మనే నమః
ఓం సురారిఘ్నే నమః
ఓం గురుతమాయ నమః 210
ఓం గురవే నమః
ఓం ధామ్నే నమః
ఓం సత్యాయ నమః
ఓం సత్యపరాక్రమాయ నమః
ఓం నిమిషాయ నమః

ఓం అనిమిషాయ నమః
ఓం స్రగ్విణే నమః
ఓం వాచస్పతయే నమః
ఓం ఉదారధియే నమః
ఓం అగ్రణ్యే నమః 220
ఓం గ్రామణ్యే నమః
ఓం శ్రీమతే నమః
ఓం న్యాయాయ నమః
ఓం నేత్రే నమః
ఓం సమీరణాయ నమః
ఓం సహస్రమూర్ధ్నే నమః
ఓం విశ్వాత్మనే నమః
ఓం సహస్రాక్షాయ నమః
ఓం సహస్రపాదే నమః
ఓం ఆవర్తనాయ నమః 230
ఓం నివృత్తాత్మనే నమః
ఓం సంవృతాయ నమః
ఓం సంప్రమర్దనాయ నమః
ఓం అహస్సంవర్తకాయ నమః
ఓం వహ్నయే నమః
ఓం అనిలాయ నమః
ఓం ధరణీధరాయ నమః
ఓం సుప్రసాదాయ నమః
ఓం ప్రసన్నాత్మనే నమః
ఓం విశ్వధృతే నమః 240
ఓం విశ్వభుజే నమః
ఓం విభవే నమః
ఓం సత్కర్త్రే నమః
ఓం సత్కృతాయ నమః
ఓం సాధవే నమః
ఓం జహ్నవే నమః
ఓం నారాయణాయ నమః
ఓం నరాయ నమః
ఓం అసంఖ్యేయాయ నమః
ఓం అప్రమేయాత్మనే నమః 250
ఓం విశిష్టాయ నమః
ఓం శిష్టకృతే నమః
ఓం శుచయే నమః
ఓం సిద్ధార్థాయ నమః
ఓం సిద్ధసఙ్కల్పాయ నమః
ఓం సిద్ధిదాయ నమః
ఓం సిద్ధిసాధనాయ నమః
ఓం వృషాహిణే నమః
ఓం వృషభాయ నమః
ఓం విష్ణవే నమః 260
ఓం వృషపర్వణే నమః
ఓం వృషోదరాయ నమః
ఓం వర్ధనాయ నమః
ఓం వర్ధమానాయ నమః
ఓం వివిక్తాయ నమః
ఓం శ్రుతిసాగరాయ నమః
ఓం సుభుజాయ నమః
ఓం దుర్ధరాయ నమః
ఓం వాగ్మినే నమః
ఓం మహేంద్రాయ నమః 270
ఓం వసుదాయ నమః
ఓం వసవే నమః
ఓం నైకరూపాయ నమః
ఓం బృహద్రూపాయ నమః
ఓం శిపివిష్టాయ నమః
ఓం ప్రకాశనాయ నమః
ఓం ఓజస్తేజోద్యుతిధరాయ నమః
ఓం ప్రకాశాత్మనే నమః
ఓం ప్రతాపనాయ నమః
ఓం బుద్ధాయ నమః 280
ఓం స్పష్టాక్షరాయ నమః

ఓం మంత్రాయ నమః
చంద్రాంశవే నమః
భాస్కరద్యుతయే నమః
అమృతాంశూద్భవాయ నమః
భానవే నమః
శశిబిందవే నమః
సురేశ్వరాయ నమః
ఔషధాయ నమః
జగతస్సేతవే నమః 290
సత్యధర్మపరాక్రమాయ నమః
భూతభవ్యభవన్నాథాయ నమః
పవనాయ నమః
పావనాయ నమః
అనలాయ నమః
కామఘ్నే నమః
కామకృతే నమః
కాంతాయ నమః
కామాయ నమః
కామప్రదాయ నమః 300
ప్రభవే నమః
యుగాదికృతే నమః
యుగావర్తాయ నమః
నైకమాయాయ నమః
మహాశనాయ నమః
అదృశ్యాయ నమః
వ్యక్తరూపాయ నమః
సహస్రజితే నమః
అనంతజితే నమః
ఇష్టాయ నమః 310
అవిశిష్టాయ నమః
శిష్టేష్టాయ నమః
శిఖండినే నమః

ఓం నహుషాయ నమః
వృషాయ నమః
క్రోధఘ్నే నమః
క్రోధకృత్కర్త్రే నమః
విశ్వబాహవే నమః
మహీధరాయ నమః
అచ్యుతాయ నమః 320
ప్రథితాయ నమః
ప్రాణాయ నమః
ప్రాణదాయ నమః
వాసవానుజాయ నమః
అపాంనిధయే నమః
అధిష్ఠానాయ నమః
అప్రమత్తాయ నమః
ప్రతిష్ఠితాయ నమః
స్కందాయ నమః
స్కందధరాయ నమః 330
ధుర్యాయ నమః
వరదాయ నమః
వాయువాహనాయ నమః
వాసుదేవాయ నమః
బృహద్భానవే నమః
ఆదిదేవాయ నమః
పురందరాయ నమః
అశోకాయ నమః
తారణాయ నమః
తారాయ నమః 340
శూరాయ నమః
శౌరయే నమః
జనేశ్వరాయ నమః
అనుకూలాయ నమః
శతావర్తాయ నమః
పద్మినే నమః

ఓం పద్మనిభేక్షణాయ నమః
పద్మనాభాయ నమః
అరవిందాక్షాయ నమః
పద్మగర్భాయ నమః 350
శరీరభృతే నమః
మహర్ధయే నమః
ఋద్ధాయ నమః
వృద్ధాత్మనే నమః
మహాక్షాయ నమః
గరుడధ్వజాయ నమః
అతులాయ నమః
శరభాయ నమః
భీమాయ నమః
సమయజ్ఞాయ నమః 360
హవిర్హరయే నమః
సర్వలక్షణలక్షణ్యాయ నమః
లక్ష్మీపతే నమః
సమితింజయాయ నమః
విక్షరాయ నమః
రోహితాయ నమః
మార్గాయ నమః
హేతవే నమః
దామోదరాయ నమః
సహాయ నమః 370
మహీధరాయ నమః
మహాభాగాయ నమః
వేగవతే నమః
అమితాశనాయ నమః
ఉద్భవాయ నమః
క్షోభణాయ నమః
దేవాయ నమః
శ్రీగర్భాయ నమః
పరమేశ్వరాయ నమః

ఓం కరణాయ నమః 380
కారణాయ నమః
కర్త్రే నమః
వికర్త్రే నమః
గహనాయ నమః
గుహాయ నమః
వ్యవసాయాయ నమః
వ్యవస్థానాయ నమః
సంస్థానాయ నమః
స్థానదాయ నమః
ధ్రువాయ నమః 390
పరర్ధయే నమః
పరమస్పష్టాయ నమః
తుష్టాయ నమః
పుష్టాయ నమః
శుభేక్షణాయ నమః
రామాయ నమః
విరామాయ నమః
విరతాయ నమః
మార్గాయ నమః
విరజోమార్గాయ నమః 400
నేయాయ నమః
నయాయ నమః
అనయాయ నమః
వీరాయ నమః
శక్తిమతాంశ్రేష్ఠాయ నమః
ధర్మాయ నమః
ధర్మవిదుత్తమాయ నమః
వైకుంఠాయ నమః
పురుషాయ నమః
ప్రాణాయ నమః 410
ప్రాణదాయ నమః
ప్రణ(వా)య నమః

ఓం పృథవే నమః
హిరణ్యగర్భాయ నమః
శత్రుఘ్నాయ నమః
వ్యాప్తాయ నమః
వాయవే నమః
అధోక్షజాయ నమః
ఋతవే నమః
సుదర్శనాయ నమః 420
కాలాయ నమః
పరమేష్ఠినే నమః
పరిగ్రహాయ నమః
ఉగ్రాయ నమః
సంవత్సరాయ నమః
దక్షాయ నమః
విశ్రామాయ నమః
విశ్వదక్షిణాయ నమః
విస్తారాయ నమః
స్థావరాయస్థాణవే నమః 430
ప్రమాణాయ నమః
బీజాయ అవ్యయాయ నమః
అర్థాయ నమః
అనర్థాయ నమః
మహాకోశాయ నమః
మహాభోగాయ నమః
మహాధనాయ నమః
అనిర్విణ్ణాయ నమః
స్థవిష్ఠాయ నమః
అభవే నమః 440
ధర్మయూపాయ నమః
మహామఖాయ నమః
నక్షత్రనేమయే నమః
నక్షత్రిణే నమః
క్షమాయ నమః

ఓం క్షామాయ నమః
సమీహనాయ నమః
యజ్ఞాయ నమః
ఇజ్యాయ నమః
మహేజ్యాయ నమః 450
క్రతవే నమః
సత్త్రాయ నమః
సతాంగతయే నమః
సర్వదర్శినే నమః
విముక్తాత్మనే నమః
సర్వజ్ఞాయ నమః
జ్ఞానయోత్తమాయ నమః
సువ్రతాయ నమః
సుముఖాయ నమః
సూక్ష్మాయ నమః 460
సుఘోషాయ నమః
సుఖదాయ నమః
సుహృదే నమః
మనోహరాయ నమః
జితక్రోధాయ నమః
వీరబాహవే నమః
విదారణాయ నమః
స్వాపనాయ నమః
స్వవశాయ నమః
వ్యాపినే నమః 470
నైకాత్మనే నమః
నైకకర్మకృతే నమః
వత్సరాయ నమః
వత్సలాయ నమః
వత్సినే నమః
రత్నగర్భాయ నమః
ధనేశ్వరాయ నమః
ధర్మగుప్తే నమః

ఓం ధర్మకృతే నమః
ధర్మిణే నమః 480
సతే నమః
అసతే నమః
క్షరాయ నమః
అక్షరాయ నమః
అవిజ్ఞాత్రే నమః
సహస్రాంశవే నమః
విధాత్రే నమః
కృతలక్షణాయ నమః
గభస్తినేమయే నమః
సత్త్వస్థాయ నమః 490
సింహాయ నమః
భూతమహేశ్వరాయ నమః
ఆదిదేవాయ నమః
మహాదేవాయ నమః
దేవేశాయ నమః
దేవభృతే నమః
గురవే నమః
ఉత్తరాయ నమః
గోపతయే నమః
గోప్త్రే నమః 500
జ్ఞానగమ్యాయ నమః
పురాతనాయ నమః
శరీరభూతభృతే నమః
భోక్త్రే నమః
కపీంద్రాయ నమః
భూరిదక్షిణాయ నమః
సోమపాయ నమః
అమృతపాయ నమః
సోమాయ నమః
పురుజితే నమః 510
పురుసత్తమాయ నమః

ఓం వినయాయ నమః
జయాయ నమః
సత్యసంధాయ నమః
దాశార్హాయ నమః
సాత్వతాంపతయే నమః
జీవాయ నమః
వినయిత్రే సాక్షిణే నమః
ముకుందాయ నమః
అమితవిక్రమాయ నమః 520
అంభోనిధయే నమః
అనంతాత్మనే నమః
మహోదధిశయాయ నమః
అంతకాయ నమః
అజాయ నమః
మహార్హాయ నమః
స్వాభావ్యాయ నమః
జితామిత్రాయ నమః
ప్రమోదనాయ నమః
ఆనందాయ నమః 530
నందనాయ నమః
(అ)నందాయ నమః
సత్యధర్మిణే నమః
త్రివిక్రమాయ నమః
మహర్షయే కపిలాచార్యాయ నమః
కృతజ్ఞాయ నమః
మేదినీపతయే నమః
త్రిపదాయ నమః
త్రిదశాధ్యక్షాయ నమః
మహాశృంగాయ నమః 540
కృతాంతకృతే నమః
మహావరాహాయ నమః
గోవిందాయ నమః

ఓం సుషేణాయ నమః
కనకాఙ్గదినే నమః
గుహ్యాయ నమః
గభీరాయ నమః
గహనాయ నమః
గుప్తాయ నమః
చక్రగదాధరాయ నమః 550
వేధసే నమః
స్వాంగాయ నమః
అజితాయ నమః
కృష్ణాయ నమః
దృఢాయ నమః
సంకర్షణాయ అచ్యుతాయ నమః
వరుణాయ నమః
వారుణాయ నమః
వృక్షాయ నమః
పుష్కరాక్షాయ నమః 560
మహామనసే నమః
భగవతే నమః
భగఘ్నే నమః
ఆనందినే నమః
వనమాలినే నమః
హలాయుధాయ నమః
ఆదిత్యాయ నమః
జ్యోతిరాదిత్యాయ నమః
సహిష్ణవే నమః
గతిసత్తమాయ నమః 570
సుధన్వనే నమః
ఖండపరశవే నమః
దారుణాయ నమః
ద్రవిణప్రదాయ నమః
దివస్పృశే నమః

ఓం సర్వదృశే నమః
వ్యాసాయ నమః
వాచస్పతయే నమః
అయోనిజాయ నమః
త్రిసామ్నే నమః 580
సామగాయ నమః
సామ్నే నమః
నిర్వాణాయ నమః
భేషజాయ నమః
భిషజే నమః
సన్న్యాసకృతే నమః
శమాయ నమః
శాంతాయ నమః
నిష్ఠాయై నమః
శాంతయే నమః 590
పరాయణాయ నమః
శుభాంగాయ నమః
శాంతిదాయ నమః
స్రష్ట్రే నమః
కుముదాయ నమః
కువలేశయాయ నమః
గోహితాయ నమః
గోపతయే నమః
గోప్త్రే నమః
వృషభాక్షాయ నమః 600
వృషప్రియాయ నమః
అనివర్తినే నమః
నివృత్తాత్మనే నమః
సంక్షేప్త్రే నమః
క్షేమకృతే నమః
శివాయ నమః
శ్రీవత్సవక్షసే నమః
శ్రీవాసాయ నమః

ఓం శ్రీపతయే నమః
శ్రీమతాంవరాయ నమః 610
శ్రీదాయ నమః
శ్రీశాయ నమః
శ్రీనివాసాయ నమః
శ్రీనిధయే నమః
శ్రీవిభావనాయ నమః
శ్రీధరాయ నమః
శ్రీకరాయ నమః
శ్రేయసే నమః
శ్రీమతే నమః
లోకత్రయాశ్రయాయ నమః 620
స్వక్షాయ నమః
స్వంగాయ నమః
శతానందాయ నమః
నందయే నమః
జ్యోతిర్గణేశ్వరాయ నమః
విజితాత్మనే నమః
అవిధేయాత్మనే నమః
సత్కీర్తయే నమః
ఛిన్నసంశయాయ నమః
ఉదీర్ణాయ నమః 630
సర్వతశ్చక్షుషే నమః
అనీశాయ నమః
శాశ్వతాయ స్థిరాయ నమః
భూశయాయ నమః
భూషణాయ నమః
భూతయే నమః
విశోకాయ నమః
శోకనాశనాయ నమః
అర్చిష్మతే నమః
అర్చితాయ నమః 640

ఓం కుంభాయ నమః
విశుద్ధాత్మనే నమః
విశోధనాయ నమః
అనిరుద్ధాయ నమః
అప్రతిరథాయ నమః
ప్రద్యుమ్నాయ నమః
అమితవిక్రమాయ నమః
కాలనేమినిఘ్నే నమః
వీరాయ నమః
శౌరయే నమః 650
శూరజనేశ్వరాయ నమః
త్రిలోకాత్మనే నమః
త్రిలోకేశాయ నమః
కేశవాయ నమః
కేశిఘ్నే నమః
హరయే నమః
కామదేవాయ నమః
కామపాలాయ నమః
కామినే నమః
కాంతాయ నమః 660
కృతాగమాయ నమః
అనిర్దేశ్యవపుషే నమః
విష్ణవే నమః
వీరాయ నమః
అనంతాయ నమః
ధనంజయాయ నమః
బ్రహ్మణ్యాయ నమః
బ్రహ్మకృతే నమః
బ్రహ్మణే నమః
బ్రహ్మణే నమః 670
బ్రహ్మవివర్ధనాయ నమః
బ్రహ్మవిదే నమః
బ్రాహ్మణాయ నమః

ఓం బ్రహ్మణే నమః
బ్రహ్మజ్ఞాయ నమః
బ్రాహ్మణప్రియాయ నమః
మహాక్రమాయ నమః
మహాకర్మణే నమః
మహాతేజసే నమః
మహోరగాయ నమః 680
మహాక్రతవే నమః
మహాయజ్వనే నమః
మహాయజ్ఞాయ నమః
మహాహవిషే నమః
స్తవ్యాయ నమః
స్తవప్రియాయ నమః
స్తోత్రాయ నమః
స్తుతయే నమః
స్తోత్రే నమః
రణప్రియాయ నమః 690
పూర్ణాయ నమః
పూరయిత్రే నమః
పుణ్యాయ నమః
పుణ్యకీర్తయే నమః
అనామయాయ నమః
మనోజవాయ నమః
తీర్థకరాయ నమః
వసురేతసే నమః
వసుప్రదాయ నమః 700
వాసుదేవాయ నమః
వసవే నమః
వసుమనసే నమః
హవిషే నమః
సద్గతయే నమః
సత్కృతయే నమః
సత్తాయై నమః

ఓం సద్భూతయే నమః
సత్పరాయణాయ నమః
శూరసేనాయ నమః 710
యదుశ్రేష్ఠాయ నమః
సన్నివాసాయ నమః
సుయామునాయ నమః
భూతవాసాయ నమః
వాసుదేవాయ నమః
సర్వాసునిలయాయ నమః
అనలాయ నమః
దర్పఘ్నే నమః
దర్పదాయ నమః
(అ)దృప్తాయ నమః 720
దుర్ధరాయ నమః
అపరాజితాయ నమః
విశ్వమూర్తయే నమః
మహామూర్తయే నమః
దీప్తమూర్తయే నమః
అమూర్తిమతే నమః
అనేకమూర్తయే నమః
అవ్యక్తాయ నమః
శతమూర్తయే నమః
శతాననాయ నమః 730
ఏకాయ (కస్మై) నమః
నైకాయ (కస్మై) నమః
సవాయ నమః
కాయ నమః
కిమే (కస్మై) నమః
యతే (యస్మై) నమః
తతే (తస్మై) నమః
పదాయానుత్తమాయ నమః
లోకబంధవే నమః
లోకనాథాయ నమః 740

ఓం మాధవాయ నమః
భక్తవత్సలాయ నమః
సువర్ణవర్ణాయ నమః
హేమాంగాయ నమః
వరాంగాయ నమః
చందనాంగదినే నమః
వీరఘ్నే నమః
విషమాయ నమః
శూన్యాయ నమః
ఘృతాశిషే నమః 750
అచలాయ నమః
చలాయ నమః
అమానినే నమః
మానదాయ నమః
మాన్యాయ నమః
లోకస్వామినే నమః
త్రిలోకధృతే నమః
సుమేధసే నమః
మేధజాయ నమః
ధన్యాయ నమః 760
సత్యమేధసే నమః
ధరాధరాయ నమః
తేజోవృషాయ నమః
ద్యుతిధరాయ నమః
సర్వశస్త్రభృతాం
వరాయ నమః
ప్రగ్రహాయ నమః
విగ్రహాయ నమః
వ్యగ్రాయ నమః
నైకశృంగాయ నమః
గదాగ్రజాయ నమః 770
చతుర్మూర్తయే నమః
చతుర్బాహవే నమః

ఓం చతుర్వ్యూహాయ నమః
చతుర్గతయే నమః
చతురాత్మనే నమః
చతుర్భావాయ నమః
చతుర్వేదవిదే నమః
ఏకపాదే నమః
సమావర్తాయ నమః
అనివృత్తాత్మనే నమః 780
దుర్జయాయ నమః
దురతిక్రమాయ నమః
దుర్లభాయ నమః
దుర్గమాయ నమః
దుర్గాయ నమః
దురావాసాయ నమః
దురారిఘ్నే నమః
శుభాంగాయ నమః
లోకసారంగాయ నమః
సుతంతవే నమః 790
తంతువర్ధనాయ నమః
ఇంద్రకర్మణే
మహాకర్మణే నమః
కృతకర్మణే నమః
కృతాగమాయ నమః
ఉద్భవాయ నమః
సుందరాయ నమః
సుందాయ నమః
రత్ననాభాయ నమః
సులోచనాయ నమః 800
అర్కాయ నమః
వాజసనాయ నమః
శృంగిణే నమః
జయంతాయ నమః
సర్వవిదే నమః

ఓం జయినే నమః
సువర్ణబిందవే నమః
అక్షోభ్యాయ నమః
సర్వవాగీశ్వరేశ్వరాయ నమః
మహాహ్రదాయ నమః
మహాగర్తాయ నమః
మహాభూతాయ నమః
మహానిధయే నమః
కుముదాయ నమః
కుందరాయ నమః
కుందాయ నమః
పర్జన్యాయ నమః
పావనాయ నమః
అనిలాయ నమః
అమృతాంశాయ నమః 820
అమృతవపుషే నమః
సర్వజ్ఞాయ నమః
సర్వతోముఖాయ నమః
సులభాయ నమః
సువ్రితాయ నమః
సిద్ధాయ నమః
శత్రుజితే నమః
శత్రుతాపనాయ నమః
న్యగ్రోధాయ నమః
ఉదుంబరాయ నమః 830
అశ్వత్థాయ నమః
చాణూరాంధ్రనిషూద
నాయ నమః
సహస్రార్చిషే నమః
సప్తజిహ్వాయ నమః
సప్తైధసే నమః
సప్తవాహనాయ నమః
అమూర్తయే నమః

ఓం అనఘాయ నమః
అచింత్యాయ నమః
భయకృతే నమః 840
భయనాశనాయ నమః
అణవే నమః
బృహతే నమః
కృశాయ నమః
స్థూలాయ నమః
గుణభృతే నమః
నిర్గుణాయ నమః
మహతే నమః
అధృతాయ నమః
స్వధృతాయ నమః 850
స్వాస్థ్యాయ నమః
ప్రాగ్వంశాయ నమః
వంశవర్ధనాయ నమః
భారభృతే నమః
కథితాయ నమః
యోగినే నమః
యోగీశాయ నమః
సర్వకామదాయ నమః
ఆశ్రమాయ నమః
శ్రమణాయ నమః 860
క్షామాయ నమః
సువర్ణాయ నమః
వాయువాహనాయ నమః
ధనుర్ధరాయ నమః
ధనుర్వేదాయ నమః
దండాయ నమః
దమయిత్రే నమః
దయాయ నమః
అపరాజితాయ నమః
సర్వసహాయ నమః 870

ఓం నియన్త్రే నమః
అనియమాయ నమః
అయమాయ నమః
సత్త్వవతే నమః
సాత్త్వికాయ నమః
సత్యాయ నమః
సత్యధర్మపరాయణాయ నమః
అభిప్రాయాయ నమః
ప్రియార్హాయ నమః
అర్హాయ నమః 880
ప్రియకృతే నమః
ప్రీతివర్ధనాయ నమః
విహాయసగతయే నమః
జ్యోతిషే నమః
సురుచయే నమః
హుతభుజే నమః
విభవే నమః
రవయే నమః
విరోచనాయ నమః
సూర్యాయ నమః 890
సవిత్రే నమః
రవిలోచనాయ నమః
అనంతాయ నమః
హుతభుజే నమః
భోక్త్రే నమః
సుఖదాయ నమః
నైకజాయ నమః
అగ్రజాయ నమః
అనిర్విణ్ణాయ నమః
సదామర్షిణే నమః 900
లోకాధిష్ఠానాయ నమః
అద్భుతాయ నమః
సనాతనాయ నమః

ఓం సనాతనతమాయ నమః
కపిలాయ నమః
కపయే నమః
అవ్యయాయ నమః
స్వస్తిదాయ నమః
స్వస్తికృతే నమః
స్వస్తినే నమః 910
స్వస్తిభుజే నమః
స్వస్తిదక్షిణాయ నమః
అరౌద్రాయ నమః
కుండలినే నమః
చక్రిణే నమః
విక్రమిణే నమః
ఊర్జితశాసనాయ నమః
శబ్దాతిగాయ నమః
శబ్దసహాయ నమః
శిశిరాయ నమః 920
శర్వరీకరాయ నమః
అక్రూరాయ నమః
పేశలాయ నమః
దక్షాయ నమః
దక్షిణాయ నమః
క్షమిణాంవరాయ నమః
విద్వత్తమాయ నమః
వీతభయాయ నమః
పుణ్యశ్రవణకీర్తనాయ నమః
ఉత్తారణాయ నమః 930
దుష్కృతిఘ్నే నమః
పుణ్యాయ నమః
దుస్స్వప్ననాశనాయ నమః
వీరఘ్నే నమః
రక్షణాయ నమః
సంతాయ నమః

ఓం జీవనాయ నమః
పర్యవస్థితాయ నమః
అనంతరూపాయ నమః
అనంతశ్రియే నమః 940
జితమన్యవే నమః
భయాపహాయ నమః
చతురశ్రాయ నమః
గభీరాత్మనే నమః
విదిశాయ నమః
వ్యాదిశాయ నమః
దిశాయ నమః
అనాదయే నమః
భువోభువే నమః
లక్ష్మ్యై నమః 950
సువీరాయ నమః
రుచిరాంగదాయ నమః
జననాయ నమః
జనజన్మాదయే నమః
భీమాయ నమః
భీమపరాక్రమాయ నమః
ఆధారనిలయాయ నమః
ధాత్రే నమః
పుష్పహాసాయ నమః
ప్రజాగరాయ నమః 960
ఊర్ధ్వగాయ నమః
సత్పథాచారాయ నమః
ప్రాణదాయ నమః
ప్రణవాయ నమః
పణాయ నమః
ప్రమాణాయ నమః
ప్రాణనిలయాయ నమః
ప్రాణభృతే నమః
ప్రాణజీవనాయ నమః

ఓం తత్త్వాయ నమః 970
తత్త్వవిదే నమః
ఏకాత్మనే నమః
జన్మమృత్యుజరాతిగాయ నమః
భూర్భువస్స్వస్తరవే నమః
తారాయ నమః
సవిత్రే నమః
ప్రపితామహాయ నమః
యజ్ఞాయ నమః
యజ్ఞపతయే నమః
యజ్వనే నమః 980
యజ్ఞాంగాయ నమః
యజ్ఞవాహనాయ నమః
యజ్ఞభృతే నమః
యజ్ఞకృతే నమః
యజ్ఞినే నమః
యజ్ఞభుజే నమః
యజ్ఞసాధనాయ నమః
యజ్ఞాంతకృతే నమః
యజ్ఞగుహ్యాయ నమః
అన్నాయ నమః 990
అన్నాదాయ నమః
ఆత్మయోనయే నమః
స్వయంజాతాయ నమః
వైఖానాయ నమః
సామగాయనాయ నమః
దేవకీనందనాయ నమః
స్రష్ట్రే నమః
క్షితీశాయ నమః
పాపనాశనాయ నమః
శంఖభృతే నమః 1000
నందకినే నమః
చక్రిణే నమః

ఓం శార్ఙ్గధన్వనే నమః
గదాధరాయ నమః
రథాఙ్గపాణయే నమః

ఓం అక్షోభ్యాయ నమః
సర్వప్రహరణాయుధాయ నమః

శ్రీ లక్ష్మినారాయణాయస్వామినే నమః

శ్రీ విష్ణు సహస్ర నామావళిః

సమాప్తా.

---

# మంగళహారతి

శ్రీ నారాయణ ప్రభుదేవునకు, శుభనీరాజనములివే ॥శ్రీసత్॥
శ్రీ సత్యప్రభు వరదేవునకు జయనీరాజనములివే ॥శ్రీ నారా॥

1. కలియుగమున సత్యవ్రతమే । ప్రజా । సకలాభీష్టప్రదమే । నారదయోగికి నారాయణుడే । ఈరీతిని నుపదేశించె । ఇది త్రిభువనముల వ్యాపించె ॥శ్రీ నారాయణ॥

2. ఏ దినముననైననుగానీ । మరే । సమయమునందున నేనీ । కఠిన దీక్షతో । క్రమ పద్ధతితో । సత్యప్రభు వ్రతపూజా । సలుపగవచ్చును రాజా ॥శ్రీ నారాయణ॥

3. నిరుపేదబాప డీవ్రతము । నెఱపంగజూచి సంతతము । చెఱకులమ్ముకొను శ్రామికుడొకడూ సలిపెను సత్యవ్రతము । సిరిసంపదల యమృతము ॥శ్రీ నారాయణ॥

4. ఉల్కాముఖుడను నొకరాజు । వ్రత మొనరించెడి యామోజు । కని । పర్తకుడొకరుడు । వ్రతమతిసుతగని । మొరకు గడపె రోజుకు రోజు ॥ శ్రీ నారాయణ॥

5. సత్యప్రభు కినుకకు గురియౌచు । నానాబాధలు పడె యాపిచు । స్వామివారి వ్రత । సంపూజనమున సంకటములు నశియించ । సంపదలొంది సుఖించ ॥ శ్రీ నారాయణ॥

6. పతిరాక కలావతి గుర్తించి । పయనించె ప్రసాదము త్యజియించి । ఆకాశాగత దివ్యవాణి విని । స్వీకరించె ప్రభు తీర్థ ప్రసాదం । చేకొనె పతి సందర్శన మోదం ॥ శ్రీ నా॥

7. తుంగధ్వజుడను రాజొకడు । దుర్మదమున మిట్టి పడుకడు । స్వామివారి తీర్థ ప్రసాదములే । సంత్యజించి సిరిగోలుపడె । సద్వ్రత మొనరుచ పొలుపడె । సామ్రాజ్యముగొని సౌఖ్య పడె ॥ శ్రీ నారాయణ॥

8. సరిలేదు సత్యవ్రతమున కీడు । మరిలేడు సత్యసామికి జోడు । కరిలోన సత్య ప్రభువే ప్రభువు మన । కష్ట సంతతుల కిక సెలవు । మన । యిష్ట సంపదల కిది నెలవు ॥ శ్రీ నారా॥

